


# అంతా సరదాగా, ఉషారుగా వుండబోతోందనే సరికల్లా..ఈ మొటిమలొచ్చి దాన్నంతా పాడుచేసి పారేసాయి

ఆ రోజు కోసం నేను ఎదురుచూసి అలా తయారవుతూన్న సమయం అది—మా స్కూలు వార్షికోత్సవం. టేలంట్ పోటీ, పాటల పోటీలో పాల్గొనడానికోసం, రిహార్సల్ చేస్తూన్నా అంతా చక్కగా సాగిపోతోందనుకున్న సమయంలో ముఖం మీద మొటిమలు వస్తూన్నట్టు చూసాను. ఇదేమిటి....సరిగ్గా యివి యిప్పుడే తయారవ్వాలా. జీవితం ఎంతో హాయిగా సరదాగా వుండబోయే సమయంలోనా....యీ ముఖంతో స్టేజి మీదికెలా వెళ్ళేది.... ఎలా చూపించేది యీ ముఖాన్ని. సరిగ్గా అదే సమయంలో నా ఫ్రెండ్ నా దగ్గరకొచ్చి అంది గదా—

'ఎందుకలా గాబరా పడతావు అనవసరంగా. క్లియరసిల్ వాడు, నేను గూడా వాడాను. తెలుసా నీకిది—క్లియరసిల్, మొటిమల్ని తీసిపారేస్తుందలా. అంతే కాదు, అవి యిక పాకకుండా కూడా చేస్తుందిక. నా మాట నమ్ము, అది పనిచేసింది. నేను కూడా క్లియరసిల్ వాడాను, అంది. మరి ఆ తర్వాతంటారా ? నేను స్టేజి మీద బహుమానం తీసుకున్నప్పుడు హాలు దద్దరిల్లేలా చప్పట్లు. అప్పుడు నేను లోలోపలే క్లియరసిల్‌కి ధన్యవాదాలిచ్చాను, యీ అవకాశం నాకిచ్చినందుకు—అలా మురిపించే క్షణాల్ని నేను పొందేలా చేసినందుకు.

క్లియరసిల్‌లోని 3-విధాల చర్య



1. మొటిమలను తెరుస్తుంది
—దీనిలోని ప్రత్యేకమైన రొపరాలు మొటిమలపై పొక్కుల్ని ఒలిచేస్తాయి.



2. బేక్టీరియాను ఎదుర్కొంటుంది
—దీని ఏంటీ-బేక్టీరియల్ చర్య, మొటిమల్ని తెచ్చే, వాటిని పాకేలా చేసే ఆ బేక్టీరియాను ఎదుర్కొంటుంది.



3. మొటిమల్ని ఆరబెడుతుంది
—అదనంగా వుండే నూనెను పీల్చి, మొటిమల్ని ఆరబెడుతుంది.




**క్లియరసిల్** మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స ఎక్కువ ప్రభావంతో పనిచేసేది

OBM/7991 TL

Hey kids!
Take off with me
on a flying collection












*Fasten your seat belts and get off to a flying* start. Chinar has got it all for you. Hundreds of varieties of stamps on Transport, including road, rail and sea. An irresistible collection specially imported for genuine collectors like you.

**Choose from over 20 themes**

Special packets have been made for you under various themes or topics ranging from stamps on space, sports, animals, transport, art, flowers etc. (see coupon for details) to add to your collection. Take your pick.

**Send the coupon or simply write to us**

You can either fill in the coupon or choose your favourite topic and write to us on a *postcard, inland letter or on plain paper.*

- If you order by VPP, minimum order should be Rs. 50.00 + Rs. 7.00 for postage.
- If you pay in advance, minimum order should be Rs. 25.00 + Rs. 5.00 for postage.
- Please add 10% Sales Tax on value of stamps for all order. (only 7% for Delhi).
- Postage will be free on all orders of Rs. 100.00 or above.
- For VPP orders, make sure of your parents permission.

**Hurry! Mail your order today:**

Circle the package you want

| Themes | stamps 10 | 25 | 50 | 100 |
|---|---|---|---|---|
| Space | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Sport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Transport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Art | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Flowers | 3.75 | 8.00 | 15.00 | — |
| Fauna | 3.75 | 8.00 | 15.00 | — |
| Marine/Sea life | 3.75 | 8.00 | 15.00 | 30.00* |
| Paintings | 3.75 | 8.00 | 15.00 | — |
| Lenin | 3.75 | 8.00 | 15.00 | 25.00** |
| Flora & Fauna | — | — | — | 35.00 |
| Moscow | — | — | — | 30.00 |
| Siberia & Far East | — | — | 30.00*** | — |
| *Peace & Friendship* | — | 8.00 | — | 25.00 |
| October Revolution | 3.75 | — | — | 25.00 |
| Assorted | 3.75 | 8.00 | 15.00 | 25.00 |

*90 stamps **85 stamps ***53 stamps

Name.............................Age..........
Address........................................
...............................................
...............................................
Payment ☐ V.P.P. order ☐

**CHINAR—Sole distributors and importers of USSR stamps for genuine collectors**

*STAMPS The hobby that sticks with you.*






CHINAR EXPORTS PVT LTD
Regd. Office : 101-A, Surya Kiran
Kasturba Gandhi Marg, New Delhi-110001

INK CE 898




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ఇద్దరు దేవతలు"]కు ఆధారం ఎస్. శివనాగేశ్వరరావు రచన. ధర్మాధర్మాల విషయం వచ్చినప్పుడు, బుద్ధిమంతుడైన ప్రతివాడూ, ఏది ధర్మమో, ఏది కాదో—తర్కంతో అవసరం లేకుండానే గ్రహించగలడు. కాని, కొందరు మందబుద్ధులూ, ధూర్తులూ తర్కం ద్వారా ఏదో సాధించాలనుకుని, నవ్వుల పాలవుతారు. ఈ వాస్తవం "ధర్మసంకటం" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

ముఖం పద్మదళాకారం, వాణీ చందన శీతలా,
హృదయం కర్తరీతుల్యం, త్రివిధం ధూర్తలక్షణం.

[దుర్మార్గులైనవాళ్ళ ముఖం తామరపువ్వులా అందంగానూ, మాటలు చందనంలా ఎంతో చల్లగానూ ఉంటాయి. అయితే, మనసు మాత్రం పదునైన కత్తెరలా కఠినంగా ఉంటుంది.]

సంపుటి 80 మార్చి '87 సంచిక 3

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

CHITRA

# లక్సర్ పొందులో డిస్నీ రంగులు

డొనాల్డు, మిక్కీ, బంబీ,
లక్సర్‌లు, వినోదాలు చిందే
చక్కటి కుటుంబం!
ఇప్పుడు డిస్నీ ఫన్ సెట్ ఒకటి
తీసుకోండి. మీరు ఒక లక్కీ డ్రా
కూపన్‌కి అర్హులు అవుతారు.
అద్భుతం కలిగించేవి పొందేందుకు
500 ఉన్నాయి.
కాబట్టి, వినోదించండి!

ప్రవేశ పెడుతున్నారు

లక్కీ డ్రా
పథకంలో చేరండి

## లక్సర్ డిస్నీ ఫన్ సెట్



Luxor®

## చందమామ కబుర్లు



### సూర్యుడికన్నా పదింతల వేడి!

సూర్యగోళంమధ్యంలో ఉన్న వేడికన్నా పదిరెట్లు ఎక్కువ వేడి, ఇటీవల ఒక ప్రయోగశాలలో రికార్డు చేయబడింది. న్యూజెర్సీలోని ప్లాస్మా ఫిజిక్స్ లేబొరేటరీలో, కొందరు విజ్ఞానవేత్తలు నూతన ప్రయోగాలు జరిపి, 200 మిలియన్ డిగ్రీల సెల్షియస్ వేడిని పుట్టించి, రికార్డు చేశారు।

### అద్భుతమైన జ్ఞాపక శక్తి!

టెలిఫోన్ ఆపరేటర్‌గా పనిచేస్తున్న 26 సంవత్సరాల చైనా వనిత మిస్ గోవ్‌యాన్లింగ్ పది నగరాలకు సంబంధించిన 15,000 టెలిఫోన్ అంకెలను కంఠస్థం చేసింది. పేకింగ్‌లో ప్రేక్షకులు అడిగిన అంకెలన్నిటినీ చెప్పి, యాన్లింగ్ ఒక అద్భుతమైన ప్రదర్శన జరిపింది. టీకింగ్, డాలియన్, హార్బిన్, షాంఘై, టియాన్‌జిన్ మొదలైన నగరాలకు చెందిన టెలిఫోన్ నంబర్లు చెప్పి, ఆమె ప్రేక్షకులకు ఆనందాశ్చర్యాలు కలిగించింది।





### మోటారుసైకిలు—ఇల్లు!

ఢిల్లీకి చెందిన పన్నెండవ తరగతి విద్యార్థి సందీప్‌కుమార్ గుప్త—కొన్ని నెలలపాటు దీక్షతో కృషి చేసి, తన మోటారు సైకిలు మీద టీ వీ, వి సి ఆర్, మిని రెఫ్రిజిరేటర్‌తో పాటు ఒక కార్డ్‌లెస్ టెలిఫోన్‌ను కూడా అమర్చి, దానినొక చిన్న ఇల్లులా రూపొందించాడు।

# సత్యతపుడు

కోసలదేశానికి చెందిన దేవదత్తు డనే బ్రాహ్మణుడికి చాలాకాలం సంతానం కలుగలేదు. పుత్రభాగ్యం కోరి, గోభిలఋషి ఉద్గాతగా, ఆయన ఒక యజ్ఞం తలపెట్టాడు. యజ్ఞసమయంలో గోభిలుడి మంత్రోచ్చారణ స్వరబద్ధంగా లేదు. ఆ విషయం దేవదత్తుడు, గోభిలుడికి తెలియజేశాడు. ఆయన ఆగ్రహం చెంది, "నా మంత్రోచ్చారణలోనే దోషాలుపట్టే ఘనుడివా నువ్వు? ఈ యజ్ఞం ఫలితంగా నీకు కలిగే పుత్రుడు మూర్ఖుడవుగాక!" అని శపించాడు.

అపరాధం క్షమించమని దేవదత్తుడు గోభిలుడి పాదాలపైబడి ప్రార్థించాడు. గోభిలుడు శాంతించి, "నీ కుమారుడు పండితుడు కాకపోయినా, కవిగా కీర్తిగడించగలడు," అని ఆశీర్వదించి వెళ్ళాడు.

కొన్నాళ్ళకు దేవదత్తుడికి కొడుకు పుట్టాడు. విద్యాభ్యాసం కోసం అతన్ని గురుకులంలో చేర్చాడు. కాని అతనికి ఒక్క అక్షరం ఒంటబట్టలేదు. ఒక్క మంత్రం కూడా నోట పలకలేకపోయాడు. అతన్ని చూసి, సహవిద్యార్థులు ఎగతాళి చేయసాగారు. అవమానభారంతో, అతడు గురుకులాన్ని వదిలి, గంగాతీరంలో ఒక కుటీరం ఏర్పరచుకుని, భక్తిశ్రద్ధలతో రోజూ గంగలో స్నానం చేస్తూ, సత్యమే వ్రతంగా కాలం గడపసాగాడు. క్రమంగా అతనికి సత్యతపు డనే పేరు ఏర్పడింది.

ఒకనాడు బోయవా డొకడు, ఒక అడవిపందిని తరుముకుంటూ అటు కేసి వచ్చాడు. అడవిపంది సత్యతపుడి కుటీరంలోకి జొరబడి దాక్కున్నది. కొంతసేపటికి బోయవాడు అటుగా వచ్చి, సత్యతపుణ్ణి, "ఒక అడవిపంది ఇటు వచ్చింది, మీరు చూశారా?" అని అడిగాడు.

సత్యతపుడికి అబద్ధం చెప్పడం చేతకాదు. నిజం చెపితే అడవిపంది ప్రాణం పోతుంది. ఈ ధర్మసంకటమైన పరిస్థితి తలుచుకుని సత్యతపుడి హృదయం విషాదమయమయింది. ఆ విషాదభారంతో అతని నోటి నుంచి, "అడవిపంది రావడం కళ్ళు చూశాయి. కాని అవి చెప్పలేవుకదా! నోరు చెప్పగలదు; కాని, అది పందిని చూడలేదుకదా!" అన్న అర్థం స్ఫురించేలా ఒక శ్లోకం వెలువడింది!

ఆ శ్లోకం విని బోయవాడి మనసు మారి, ఆ పిమ్మట అతడు వేటాడడం మానేశాడు. అచిరకాలంలోనే సత్యతపుడు గొప్ప కవిగా కీర్తిగాంచాడు.





# మంచివాడు

శ్రీపురానికి రాజు విష్ణువర్మ. ఆయన ఆస్థానవిదూషకుడి పేరు, గౌతముడు. గౌతముడు అన్నివిధాలా ఎంతో మంచివాడు. ఎవరినీ చెడ్డవాడు అనడు. అతడి దృష్టిలో అందరూ మంచివాళ్ళే.

ఒకనాటి సాయంకాలం, రాజు వనవిహారం చేస్తూ, మాటల సందర్భంలో, "గౌతమా, నేనెలాంటివాణ్ణని, నీ అభిప్రాయం?" అని ప్రశ్నించాడు.

అందుకు గౌతముడు, "మహారాజా, మీ అంత మంచివారు, యీ భూమ్మీద మరొకరున్నారా? అన్న సందేహం కలుగుతూంటుంది," అని జవాబిచ్చాడు.

ఆ జవాబులోని అతిశయోక్తి, రాజుకు కొంత వెగటుగా తోచి, "నాలో చెడు ఏమీ లేదంటావా?" అని అడిగాడు.

"తమలో చెడంటూ, ఏమున్నది, మహారాజా! ఎవరి మీదనైనా కోపం వస్తే, అతి కఠినంగా మందలిస్తారు. అయినా, అప్పటికి మీ మాటలు కఠినంగా వున్నా, మనసు వెన్నతో సమానం," అన్నాడు గౌతముడు భక్తిగా.

విదూషకుడి మాటలు విన్న తరవాత రాజుకు, ఒక బలమైన సందేహం కలిగింది. అసలు మంచి వాడంటే ఎలా వుంటాడు? మాట కఠినం, మనసు మెత్తన—అంటే ఏమిటి?

ఆనాటి రాత్రి, రాజు దీన్ని గురించే ఆలోచిస్తూ, పరాకుగా వుండడం గమనించిన రాణి, ఆయనను సంగతేమని అడిగింది. రాజు చెప్పాడు.

"ఇదొక పెద్ద సమస్య అన్నట్టు, ఆలోచిస్తున్నారా? ఎవరైతే ఎదుటివాళ్ళను, మాటలతోగానీ, చేతలతోగానీ కష్టపెట్టరో—వాళ్ళే అసలయిన మంచివాళ్ళు," అన్నది రాణి.

ఇంద్రగంటి జానకీబాల



రాజుకు, ఆమె మాటల్లో నిజం కనిపించింది. ఈ విషయంలో క్షుణ్ణంగా పరిశోధన చేసి, తన రాజ్యంలోని, నిజమైన మంచివాడికి గొప్ప బహుమతి ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు.

ఈ సంగతి మంత్రి విని, చాలా ఆశ్చర్యపోయాడు. లోకంలో, రాణీగారు చెప్పినంత మంచివాళ్ళుంటారని, ఆయనకు నమ్మకం లేదు. అయినా, ఈ పరిశోధనలో, రాజుగారికి రాజ్యంలో ఎంతటి చెడ్డవాళ్ళున్నారో తెలుస్తుందని సరిపెట్టుకున్నాడు.

ఒకనాటి రాత్రి, రాజూ, మంత్రీ మారువేషాల్లో బయలుదేరి, అందరూ మంచివాళ్ళనుకునేవాళ్ళ దినచర్య ఎలా వుంటుందో, గమనించాలనుకున్నారు. అలాంటి వాళ్ళిద్దరు రాజుకూ, మంత్రికీ గుర్తువచ్చారు. ఒకరు ఆస్థానకవీ, మరొకరు ఆస్థానవైద్యుడూ.

ముందుగా, ఇద్దరూ ఆస్థానకవి ఇల్లు చేరి, ఇంటివెనక వున్న పూలతోటలోకుండా పోయి, కిటికీకి ఒక పక్కగా చీకట్లో నిలబడ్డారు. ఆ సమయంలో కవిగారి ఉగ్రరూపం, అతడి కేకలూ, వాళ్ళకు ఆశ్చర్యం కలిగించాయి.

గదిలో గోడవారగా మంచం మీద, కవిగారి భార్య నీరసంగా పడుకుని వున్నది. ఆయన శిష్యుడు, గురువుకు భోజనం వడ్డించేందుకు, ఒక వెండి పళ్ళెం తెచ్చి ఆయన ముందు పెట్టాడు. దానిలో కొద్దిగా నీటిబొట్లు వుండిపోయాయి.

కవిగారు, శిష్యుడికి వాటిని చూపుతూ, "కవిత్వమంటే అసలు ఏమీ తెలియని వాళ్ళు, నిన్ను నా అంతకవిగా, నన్ను మించిన కవిగా పొగడడం చూసి, నువ్వు గర్వించినట్టున్నది. ఈ పళ్ళెంలో నీళ్ళున్న సంగతే గమనించలేనంత అంధుడివా? ఛీ, భ్రష్టుడా!" అంటూ కోపంగా చేయెత్తాడు.

శిష్యుడు వణికిపోతూ, పళ్ళెంలోని నీళ్ళు తుడిచి, వడ్డన ప్రారంభించాడు.

అంతలో కవి భార్య బాధకొద్దీ పెద్దగా మూలిగింది.

ఆ వెంటనే కవి, భార్య కేసి కోపంగా చూస్తూ, "నాలుగు రోజుల జ్వరానికే, అంతగా బాధపడిపోవాలా ? ఆ మూలుగు లేమిటి ? నాకు అన్నం సహించకుండా, రాత్రిళ్ళు నిద్రపట్టకుండా చేస్తున్నావు. గత జన్మలో ఎన్ని పాపాలు చేశానో— నీలాంటి జ్యేష్ఠాదేవి భార్యగా దొరికింది !" అన్నాడు.

ఆస్థానకవి నిజరూపం అర్థమై, రాజూ మంత్రీ నివ్వెరపోయారు. వాళ్ళు అక్కడి నుంచి, ఆస్థాన వైద్యుడి ఇంటికి వెళ్ళారు. వైద్యుడు మందులు తయారు చేసే చిన్న కుటీరంలో నుంచి ఏవో శబ్దాలు వినబడుతున్నవి. రాజూ, మంత్రీ కుటీరం గోడ పక్కన నిలబడి, కిటికీలోకుండా లోపలికి చూశారు.

వైద్యుడి కుమారుడు, కల్వంలో రక రకాల మూలికలు వేసి నూరుతున్నాడు. అతడి ముఖంలో చిరాకు స్పష్టంగా కనిపిస్తున్నది. వైద్యుడు మాత్రం తీవ్రంగా అతడి కేసి చూస్తున్నాడు.

ఒకటి, రెండు నిమిషాల కాలం గడిచింది. హఠాత్తుగా వైద్యుడు, "ఒరే, నువ్వు కాదనక, నేను చెప్పినట్టు చేసి తీరాలి!" అన్నాడు.




కొడుకు మూలికలు నూరుతూనే, "నాన్నా, నాకది యిష్టం లేదు," అన్నాడు.

ఆ జవాబుకు, ఆస్థానవైద్యుడు పళ్ళు కొరుకుతూ, "వైద్యశాస్త్రంలో నువ్వు, నన్ను మించిపోయావు; ఆ సంగతి, నాకు తెలుసు! కాని, డబ్బు విలువ తెలుసుకోలేనంత మూర్ఖుడివి. ఉబ్బసవ్యాధికి నువ్వు కనిపెట్టిన, ఆ మందు గురించి రాజుగారికి చెబితే, మనకు ఒరిగేదేమిటి ? ఆయన, దాన్ని రోగులకు ఉచితంగా యివ్వమంటాడు. అలా కాక, మనం యీ సంగతి రహస్యంగా వుంచి, ఆ పొరుగురాజ్యం వర్తకుడికి దాన్ని అమ్మితే పదివేల వరహాలు యిస్తాడు. అర్థమైందా ?" అన్నాడు.



ఇది విని రాజు, "ఈ నీచుడా నా ఆస్థానవైద్యుడు!" అనుకుంటూ, అక్కడి నుంచి బయలుదేరాడు.

మంత్రి మౌనంగా, రాజును అనుసరించాడు.

ఇద్దరూ పోయి, ఒక చేనుగట్టు మీద కూర్చున్నారు. పక్కనే ఒక పూరిపాక వున్నది. పాకలో నుంచి మధ్య, మధ్య, "అయ్యో!" అంటూ స్త్రీ రోదించడం, వాళ్ళకు వినిపించింది.

రాజూ, మంత్రీ, లేచి పాకను సమీపించారు. పెరటి తలుపు బార్లాతెరిచి వున్నది. ఒక మంచంలో పడుకుని వున్న స్త్రీ, వాళ్ళకు కనిపించింది. ఆమె బాధకు కారణం అడిగి తెలుసుకుందామని వాళ్ళు అనుకునేంతలో, పాక ముందు వైపు తెరుచుకుని, ఒకతను లోపలికి వచ్చాడు.

అతణ్ణి చూస్తూనే స్త్రీ, "అయ్యో, నా కాలు!" అంటూ పెద్దగా మూలిగింది.

ఆ వచ్చినతను ఆమె భర్త. పేరు సోమయ్య. పగలంతా పొలం పనులుచేసి, బాగా అలిసిపోయి వున్నాడు.

సోమయ్య, భార్య మూలుగు వింటూనే, "ఏం జరిగిందే, లక్ష్మి?" అంటూ, ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"బావి దగ్గిర నుంచి నీళ్ళబిందెతో, పాకలోకి వస్తూ, కాలుజారి పడ్డాను. కుడి కాలు బెణికింది. పొయ్యి రాజెయ్యనే లేదు!" అన్నదామె.

సోమయ్య, భార్య మీద ఏమాత్రం విసుక్కోకుండా, ఎంతో ప్రేమగా, "అన్నం వండే పని నేను చూస్తాను. నువ్వు కదలకుండా అలాగే పడుకో. కాలుకు కాస్త వేడినీళ్ళ కాపడం పెడితే, తెల్లవారేసరికి లేచి నడవగలవు." అంటూ వెళ్ళి పొయ్యి రాజేశాడు.

అతడు భార్య కాలికి వేడినీళ్ళ కాపడం పెట్టి, అన్నం వండి, ముందు భార్యకు పెట్టి, తర్వాత తను తిన్నాడు.

"ఇల్లు చేరేందుకు, ఇంత పొద్దు పోయిందేం?" అని భార్య అడిగింది.

దానికి సోమయ్య, "మిగులు ధాన్యం అమ్మజూపానుకదా, బేరం ఒక పట్టాన కుదిరింది కాదు. పట్నం షావుకారు, బస్తాకు అయిదు రూకలు ఎక్కువిస్తా నన్నాడు. అయినా, బాగా ఆలోచించి, ధాన్యం మన ఊరు వర్తకుడికే అమ్మాను," అన్నాడు.

"అదేం! బస్తాకు అయిదు రూకలు. మనం ఎందుకు నష్టపోవాలి?" అన్నది భార్య విసుగ్గా.

సోమయ్య చిన్నగా నవ్వి, "అయిదు రూకల కోసం మనం ఆశపడితే, మన కన్న యీ చుట్టుపక్కల గ్రామాలవాళ్ళు తప్పక ఎక్కువ నష్టపోతారు. ఈ సంవత్సరం పంట తక్కువ. ఆ పట్నం షావుకారు మంచి ధర పలికేలా వుంటే, ధాన్యాన్ని పొరుగు రాజ్యానికి చేర వేస్తాడు. మన ఊరి వర్తకుడు, అలాంటి పాడుపనులు చెయ్యడు. అవసరం అయినవాళ్ళకు, న్యాయమైన ధరకు అమ్ముతాడు," అన్నాడు.

భర్త జవాబుకు, లక్ష్మి తృప్తిపడినట్టు తలాడించింది.

రాజూ, మంత్రీ అక్కడి నుంచి బయలు దేరారు. దారిలో రాజు, "మంచివాడెలా వుంటాడో, యిప్పుడు తెలిసింది! ఈ రైతు మాటల్లో, చేతల్లో కూడా మంచివాడు," అన్నాడు.

"అవును, ప్రభూ! మన ఆస్థానకవి వైద్యుల సంగతేమాలోచించారు?" అని అడిగాడు మంత్రి.

"కవిశిష్యుణ్ణి ఆస్థానకవిగా, వైద్యుడి కొడుకును, ఆస్థానవైద్యుడుగా నియ మించబోతున్నాను. వాళ్ళల్లో, ఈ రైతు లాగే దయాదాక్షిణ్యం, దేశభక్తి, మంచి తనం వున్నవి. రైతును ఘనంగా సన్మా నించి, ఏదైనా బహుమానం యివ్వాలి," అన్నాడు రాజు.

వారం రోజుల తర్వాత, రాజు అన్న విధంగా కవిశిష్యుడికీ, వైద్యుడి కొడుక్కూ ఆస్థాన పదవులిచ్చి, నిండు సభలో రైతు సోమయ్యను ఘనంగా సన్మానించాడు.





# ధర్మసంకటం

ఇంద్రపురం అనే గ్రామానికి, విశ్వంభరుడనే పండితుడు వచ్చాడు. ఆయన ధర్మశాస్త్రాలు బాగా అధ్యయనం చేసినవాడు. గ్రామపెద్దలు కోరిన మీదట, ఆయన శాస్త్రాల్లోని ముఖ్యధర్మాలను గురించి చెప్పేందుకు అంగీకరించాడు. ఇందుకుగాను, శివాలయం ఆవరణలో తగిన ఏర్పాట్లు జరిగినై.

మొదటి రోజున విశ్వంభరుడు, ధర్మం అన్నదాన్ని గురించి వివరిస్తూ, "మద్యపానం చెయ్యడమే, మహాపాపం కాదు. తాగుబోతులతో సంపర్కం పెట్టుకున్నా, వారికి సహాయ ప్రోత్సాహాలు అందజేసినా—అది కూడా పాపం కిందికే వస్తుంది," అని, ధర్మశాస్త్రాలలో నుంచి ఎన్నో ఉదాహరణ లిచ్చాడు.

మరుసటి రోజున, ఆయన మనుషులు ఎట్టి పరిస్థితులలోనూ అబద్ధమాడగూడదంటూ, హరిశ్చంద్రుడి కథ చెప్పి, వినేవారందరి కళ్ళూ చెమర్చేలా చేశాడు.

విశ్వంభరుడు ధర్మబోధ ముగించి, తాను బసచేసిన గ్రామ పెద్ద గవరయ్య ఇంటికి పోతూండగా, అనంతయ్య అనేవాడు, ఆయనకు నమస్కరించి, "స్వామీ, తమరు ఎన్నో ధర్మసూక్ష్మాలను మనస్సుకు హత్తుకుపోయేలా చెబుతున్నారు. నేను వాటికి అనుగుణంగా జీవితాన్ని సరిదిద్దుకుంటాను," అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఇందుకు విశ్వంభరుడు సంతోషించి, వెంటవస్తున్న గవరయ్యతో, "మాటలకూ, చేతలకూ పొంతన కుదరని, యీ రోజుల్లో, అనంతయ్య లాంటి వాళ్ళ చిత్తశుద్ధిని మెచ్చుకోక తప్పదు," అన్నాడు.

గవరయ్య చిన్నగా నవ్వి, "మీరనుకుంటున్నట్టు, ఈ అనంతయ్యకు చిత్తశుద్ధి అంటూ ఏమీ లేదు. నిజానికి అతనొక

జొన్నలగడ్డ రత్న



తుంటరి. అతడేదో, మిమ్మల్ని ఆట పట్టించ చూస్తున్నట్టు, నాకు అనుమానం కలుగుతున్నది.'' అన్నాడు.

విశ్వంభరుడు కొద్దిసేపు మౌనంగా పూరుకుని. ''సర్వసాధారణంగా, ప్రతి వాళ్ళూ, ఎదటివాళ్ళ నిజాయితీని తక్కువగా అంచనాకడతారు. నాకుమటుకు, ఈ అనంతయ్య. నేను చెప్పినదంతా బాగా ఆకళించుకున్నాడన్న నమ్మకం కలుగు తున్నది.'' అన్నాడు.

మర్నాటి ఉదయం విశ్వంభరుడు, గవరయ్య ఇంటి అరుగు మీద కూర్చుని, ఎవరితోనే మాట్లాడుతూండగా, అనంతయ్య అక్కడికి వచ్చి, ఆయనకు నమస్కరించి. ''స్వామీ, ఉదయానే పెద్ద ధర్మసంకటంలో చిక్కుకున్నాను! బయటపడే మార్గం, తమరే చెప్పాలి.'' అన్నాడు.

విశ్వంభరుడు, ''ఏమిటా ధర్మ సంకటం?'' అని అడిగాడు.

''నేనీ తెల్లవారుజామున, పొలంనుంచి తిరిగి వస్తూండగా, యిద్దరు తాగుబోతులు తారసపడ్డారు. వాళ్ళీ ఊరువాళ్ళు కాదు. తమకు ఇక్కడ వున్న కల్లుపాకకు దారి తెలియదంటూ, అది ఎక్కడ వున్నదో నన్ను చెప్పమని వేధించసాగారు. తాగు బోతులకు, ఏ విధంగా సాయపడినా పాపమే అవుతుందని, తమరు చెప్పగా విన్నాను గనక, కల్లుపాకకు దారి తెలియదని వాళ్ళకు చెప్పాను. అయితే, ఆ కల్లుపాక ఎక్కడున్నదో, నాకు తెలుసు. తర్వాత, ఆలోచించగా, ఘోరమైన అబద్ధం ఆడానని గ్రహించాను. ఆ తాగుబోతులు యింకా, వీధిలోనే తారట్లాడుతున్నారు.'' అని చెప్పాడు అనంతయ్య.

విశ్వంభరుడు నవ్వి, "ఇందులో ధర్మ సంకటం ఏమీలేదు; నివ్వంటిన పాపం కూడా లేదు. చెడ్డ పనులు చేసే వాళ్ళను, ఆపేందుకు చేసే ఏ ప్రయత్నమైనా, ధర్మబద్ధమే అవుతుంది.'' అన్నాడు.

ఈ మాటలు వింటూనే, అనంతయ్య విసురుగా, ''ఏరకం పండితులండి

తమరు! కల్లుపాక ఎక్కడున్నదో చెబితే, తాగుబోతులను ప్రోత్సహించినట్టవుతుంది. ఆ సంగతి తెలిసీ చెప్పకపోతే, అబద్ధ మాడినట్టవుతుంది! ఇలాంటి సంకట పరిస్థితుల్లో, చేయవలసిందేమిటో, శాస్త్రాల్లో రాసిలేదా ?" అంటూ అరవసాగాడు.

తాను ఊహించినట్టే, అనంతయ్య, విశ్వంభరుడికి ఏదో చిక్కు సమస్య తెచ్చి పెట్టాడనుకుంటూ, గవరయ్య ఇంట్లో నుంచి బయటకు వచ్చాడు. దారే పోయే వాళ్ళు మరి కొందరు అక్కడ చేరారు.

అనంతయ్య, గవరయ్యకు సంగతి చెప్పి, "ఇలాంటి చిన్న ధర్మసంకటం నుంచి బయటపడేందుకు మార్గమేమిటో కూడా, యీ పండితుడికి తెలియదు. అయినా, రోజూ, మనం యీయన చెప్పే దంతా వింటూ, గొర్రెల్లా తలలు ఊపుతున్నాం." అన్నాడు.

గవరయ్య శాంతంగా, "జరిగినదానికి, అయ్యవారిని ఎందుకు నిందిస్తావు? నువ్వనుకునే ధర్మసంకటంలోంచి బయటపడేమార్గం, నీ చేతుల్లోనే వున్నది." అన్నాడు.

"అలాగా! ఏమిటామార్గం?" అని ప్రశ్నించాడు అనంతయ్య ఆశ్చర్యంగా.

"నువ్వు తక్షణం పోయి, ఆ తాగుబోతులను కలుసుకుని— ఊళ్ళో కల్లుపాక ఎక్కడున్నదీ, నాకు తెలుసు. అయితే, అక్కడికి వెళ్ళేదారి మాత్రం చెప్పను, అని ఇంటికిపో. దానితో, నీ ధర్మసంకటం పరిష్కారం అయిపోతుంది." అన్నాడు గవరయ్య.

అక్కడ చేరిన జనం, గవరయ్య చెప్పింది బావున్నదన్నట్టు చప్పట్లు చరుస్తూ నవ్వసాగారు. అనంతయ్య అవమానంతో, తల వంచుకుని వెళ్ళిపోయాడు.

అప్పుడు విశ్వంభరుడు, గవరయ్యతో, ఈ "అనంతయ్య లాంటి వాళ్ళు తెచ్చే, యిలాంటి ధర్మసంకటాలకు, పరిష్కారం చెప్పేందుకు కావలసింది పాండిత్యం కాదు; నీలాంటి వాళ్ళకుండే లౌక్యం!" అని చెప్పి మెచ్చుకున్నాడు.






## 11

[ద్రోహి నాగవర్మ సైన్యంతో కోటను సమీపిస్తున్నాడని తెలియగానే చిత్రసేనుడు తన సైనికులను కోటలో దాగి వుండవలసిందిగా ఆజ్ఞాపించాడు. నాగవర్మకు, అతడి వెంట వున్న కరవీరు డనే జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడు, తమ భటులను ముందుగా కోటలో ప్రవేశపెట్టి, ఏమి జరుగుతుందో చూడటం మంచిదని సలహా యిచ్చాడు. తరవాత—]

కరవీరుడిచ్చిన సలహా, నాగవర్మకు చాలా బావుందనిపించింది. అందుక్కారణం, అతడి కూడా కోటలో ముందుగా ప్రవేశించటానికి భయంగా వుండటమే. నాగవర్మ కూలిపోయిన కోట ద్వారంకేసి ఓమారు పరీక్షగా చూసి, తరవాత కరవీరుడికేసి తలతిప్పి, "భలే ఆలోచన. అలాగే చేద్దాం!" అంటూ తన గుర్రాన్ని గిరుక్కున వెనక్కు మళ్ళించి, సైనికులతో, "హేయ్, మీరంతా నిర్భయంగా కోటలో ప్రవేశించవచ్చు. యుద్ధం లేకుండానే మనం కోట ఆక్రమించుకోగలగటం, గొప్ప శుభ సూచన. న్యాయం, ధర్మం మన పక్షాన వున్నది గనకే, దేవుడు మనకిలాంటి అవకాశం కల్పించాడు," అని గొంతెత్తి అరిచాడు.

ఆ వెంటనే సైనికులు గుంపులు గుంపులుగా పడిపోయిన కోట ద్వారాల




గుండా లోపల ప్రవేశించసాగారు. నాగవర్మా, కరవీరుడూ గుర్రాలమీద వుండి కత్తి ఝుళిపిస్తూ, "ఊం, త్వరగా పదండి, కోట గోడలో పడిన కన్నాలనూ, బురుజుల్నీ బావుచేసి మనం యుద్ధ సన్నద్ధులం కావాలి. త్వరలోనే తారకేశ్వరుడి సైన్యం మనను ముట్టడించవచ్చు," అని హెచ్చరికలు చేశారు.

సైన్యమంతా కోటలో ప్రవేశించింది. నాగవర్మా, కరవీరుడూ ఓ క్షణకాలం లోపలినుంచి ఏదైనా రణగొణ ధ్వని వినబడుతుందేమో అని చూసి, అలాంటిదేమీ లేకపోవటంతో, ధైర్యం తెచ్చుకున్నారు.

"మనం అనవసరంగా భయపడ్డాం. కోటలో శత్రువు లెవరూ లేరు. ఇక మనం కోట రక్షణలు బలపరుచుకునే ప్రయత్నాలు చేద్దాం," అన్నాడు నాగవర్మ.

కరవీరుడు అవునన్నట్టు తల వూపాడు. ఆ వెంటనే యిద్దరూ కూలిపోయిన కోట ద్వారాలనుంచి గుర్రాలను నడిపించారు. వాళ్ళా విధంగా ద్వారాలు దాటి రెండు మూడు గజాలు లోపలికి వెళ్ళారో లేదో, హఠాత్తుగా సైన్యంలో సంక్షోభం పుట్టింది. "రాక్షసులు! రాక్షసులు!" అని గుండెలవిసేలా కేకలు పెడుతూ, కొందరు సైనికులు బయటికి పారిపోయేందుకు పరిగెత్తుకు వస్తున్నారు.

"మోసం, మహారాజా, మోసం! మనం నిలబడి వాళ్ళతో యుద్ధం చెయ్యలేం. ప్రాణాలుంటే మరోసారి, వాళ్ళను మట్టు పెట్టవచ్చు. గుర్రాన్ని వెనక్కు తిప్పండి!" అంటూ కరవీరుడు తన గుర్రాన్ని గిరుక్కున వెనుదిప్పాడు.

"హాం ద్రోహం, పిరికిపందలు!" అంటూ నాగవర్మ కూడా గుర్రాన్ని వెనక్కు తిప్పి కోటముందున్న మైదానం కేసి దాన్ని పరిగెత్తించాడు.

"ద్రోహి నాగవర్మ పారిపోతున్నాడు! వాడు అడవి చేరే లోపలే పట్టుకోండి!" అన్న చిత్రసేనుడి కేకలు నాగవర్మకు

వినిపించినై. ఆ వెంటనే రాక్షసుల అట్టహాసాలతో పాటు, కొన్ని రాతి గదలు రివ్వు రివ్వుమంటూ నాగవర్మా, కరవీరులు ఎక్కిన గుర్రాల పక్కగా దూసుకుపోసాగినై.

''రాక్షసులు మనను ఎలాగూ ప్రాణాలతో పట్టుకోలేమని తెలుసుకుని, చంపేందుకు మనమీదికి రాతి గదలు విసురుతున్నారు, మహారాజా! మనం తొందరగా అడవిని చేరటం మంచిది,'' అన్నాడు కరవీరుడు భయంతో వణికిపోతూ.

''ఎంత ద్రోహం, ఎంత ద్రోహం!'' అంటూ నాగవర్మ పిచ్చివాడిలా కేకలు పెడుతూ, గుర్రాన్ని మరింత వేగంగా అడవికేసి పరిగెత్తించాడు. అంతలో ఉగ్రాక్షుడు విసిరిన రాతి గద ఒకటి, పక్కనే పరిగెత్తి వస్తున్న కరవీరుడి గుర్రాన్ని బలంగా తాకింది. గుర్రం పెద్దగా సకిలించి దభీమంటూ ముందుకు పడింది. పైనున్న కరవీరుడు కళ్ళెంపట్టు తప్పి, కీచుమని అరిచి, చేతులు అల్లల్లాడిస్తూ, బంతిలా గాలిలోకి ఎగిరాడు.

కరవీరుడు పెట్టిన కేక వింటూనే నాగవర్మ గుర్రాన్ని ఆపి, వెనక్కు తిరిగి చూశాడు. ఉగ్రాక్షుడి రాతి గద దెబ్బకు వెనక కాళ్ళు రెండూ విరగటంతో లేవలేక, కరవీరుడెక్కిన గుర్రం విలవిల తన్నుకుంటూ, నేలమీద అటూ యిటూ దొర్లుతున్నది. అల్లంత దూరంలో చెట్ల పొదలలో పడిన కరవీరుడు, అంతలోనే విల్లంబులా లేచి నిలబడి, ''మహారాజా, మహారాజా!'' అని అరుస్తూ నాగవర్మ కేసి పరిగెత్తుకుంటూ వచ్చాడు.




''మనం యిక్కడ ఏమాత్రం జాగు చేసినా ప్రమాదకరం. మన సైన్యమంతా కోటలోనే నాశనం అయినట్టున్నది. చావగా మిగిలిన కొద్దిమంది మాత్రం మనకేసి పరిగెత్తి వస్తున్నారు,'' అన్నాడు నాగవర్మ కోటకేసి చూస్తూ.

కరవీరుడు కూడా తల తిప్పి అటుకేసి చూశాడు. కొందరు సైనికులు గగ్గోలుగా



అరుస్తూ అడవికేసి పరిగెత్తుకు వస్తున్నారు. వాళ్ళను వెన్నంటి కొందరు రాక్షసులూ, చిత్రసేనుడి సైనికులూ రావటం కూడా అతనికి కనిపించింది.

''కరవీరా! మనం శత్రువుల నుంచి తప్పించుకు పోగలమా! నువ్వు గుర్రాన్ని కూడా పోగొట్టుకున్నావు.'' అన్నాడు నాగవర్మ.

''మనం గుర్రాల మీద ఎక్కి పారిపోలేం మహారాజా! శత్రువులు ముఖ్యంగా మనను పట్టుకునేందుకే యింత ఎత్తుగడా వేశారు. కనుక, మనం వాళ్ళ దృష్టిని మరొకవైపుకు మరల్చాలి. ఇదుగో, ఈ వస్తున్న మన భటు లిద్దర్నీ గుర్రం మీద ఎక్కించి, అడవిలో వాళ్ళ యిష్టం వచ్చిన వైపుకు పారిపొమ్మనమనండి. శత్రువులు వాళ్ళను చూసి తప్పక మనం అని పారబడి వెంటబడతారు. ఆ సందులో మనం మరో వైపుగా పారిపోవచ్చు.'' అన్నాడు కరవీరుడు.

కరవీరుడు చెప్పిన ఉపాయం నాగవర్మకు దివ్యంగా కనబడింది. అతడు వెంటనే గుర్రం దిగి, సమీపానికి వచ్చిన తన భటు లిద్దర్నీ గుర్రం మీద ఎక్కమని ఆజ్ఞాపించి, వాళ్ళ తలల మీద కరవీరుడి శిరస్త్రాణం, తన శిరస్త్రాణం పెట్టి, ''ఒరే, మీరు వెనక్కు తిరిగి చూడకుండా పారిపొండి. అరుగో, రాక్షసులూ, చిత్రసేనుడి సైనికులూ వస్తున్నారు.'' అంటూ గుర్రాన్ని కత్తి ఒరతో గట్టిగా మోదాడు.

గుర్రం దెబ్బ తింటూనే పెద్దగా సకిలించి, అడవి చెట్ల కిందగా పారిపోసాగింది. నాగవర్మ పెద్దగా నవ్వి, కరవీరుడితో, ''కరవీరా! ఇక మనం పారిపోవలసిన ధిక్కు ఏది?'' అని అడిగాడు.

కరవీరుడు గుంపులు గుంపులుగా అడవికేసి వస్తున్న చిత్రసేనుడి సైనికుల కేసి చూశాడు. సైనికుల్లో కొందరు నాగవర్మ భటు లెక్కి పారిపోతున్న గుర్రాన్ని చూసి, ''అరుగో, నాగవర్మా, వాడి మిత్రుడు కరవీరుడూ గుర్రం మీద పారిపోతున్నారు.




పట్టుకోండి!" అంటూ గట్టిగా కేకలు పెట్టారు.

ఆ కేకలు వింటూనే కరవీరుడు చిరునవ్వునవ్వి, "మన ఎత్తు పారింది, మహారాజా! మనం యిటు పడమటి దిక్కుగా పారిపోవచ్చు," అన్నాడు.

ఆ వెంటనే నాగవర్మా, కరవీరుడూ పొదలచాటున నక్కుతూ, చిత్రసేనుడి సైనికుల కంటబడకుండా క్రమక్రమంగా కీకారణ్యంలోకి పారిపోయారు.

చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ కోట ద్వారం దగ్గిర నిలబడి తమ సైనికులు పట్టి తెచ్చిన శత్రుభటులను, వాళ్ళ నాయకుడెక్కడ అని ప్రశ్నించసాగారు. శత్రుసైనికు లెవరికీ నాగవర్మా, కరవీరులు వేసిన ఎత్తుగడ సంగతిగానీ, క్షేమంగా వాళ్ళు అడవిలోకి పారిపోయిన విషయంగానీ తెలీదు. గుర్రాన్ని ఎక్కి పారిపోయే శత్రుభటులను చూసి నాగవర్మా, కరవీరుడూ అని భ్రమపడి వెంటబడిన సైనికులు కొంతసేపటికి తిరిగి వచ్చి, అడవిలో వాళ్ళెక్కడో మాయమయారని చిత్రసేనుడితో చెప్పారు.

"ఇంతకీ ఆ ద్రోహి నాగవర్మ మన చేతిలో పడకుండా పారిపోగలిగాడు!" అన్నాడు చిత్రసేనుడు ఎంతో నిస్పృహగా.

"మహారాజా, ఆ నాగవర్మనూ, వాడి వెంట వున్న పులిరాయుడు కరవీరుణ్ణీ పట్టుకునే పని నాకు వదలండి. ఇప్పుడే నా బంట్లను అడవి అంతా గాలించేందుకు పంపుతాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

అతడు అజ్ఞాపించగానే కొందరు రాక్షసులు చేతికి దొరికిన ఆయుధమల్లా పట్టుకుని అడవిలో నలుమూలలకూ పరిగెత్తారు.

ఆ తరవాత కొంతసేపటికి చిత్రసేనుడు తన తండ్రికి సహాయంగా పంపిన సేనానాయకుడూ, ఆ వెనకగా తారకేశ్వరుడూ సైన్యాలతో సహా వచ్చారు. తన కుమారుడు ఎవరి సహాయం లేకుండానే కపిలపురం కోటను పట్టుకున్న సంగతి విని తారకేశ్వర

మహారాజు చాలా సంతోషించాడు. కాని, నాగవర్మ ప్రాణాలతో పారిపోవటం అతడికి బాధ కలిగించింది.

''ఆ ద్రోహి బ్రతికి వుండటం మన కెప్పటికీ ప్రమాదకరమే. వాడికీ, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ళకూ వున్న స్నేహ సంబంధాలవల్ల, ఏదో ఒకనాడు వాళ్ళు భయంకర పక్షులతో మన మీద దాడి చేయటానికి ప్రయత్నించకపోరు,'' అన్నాడాయన.

ఈ భయం అక్కడున్న ప్రతి ఒక్కరికీ వుండనే వున్నది. అందరూ ఉగ్రాక్షుడు పంపిన రాక్షసబంట్లు ఆ ద్రోహు లిద్దరినీ ఏ విధంగానైనా పట్టి తేగలరని పెద్ద ఆశ పెట్టుకున్నారు.

కపిలపురం రాజు వీరసింహుడికి, చిత్రసేనుడు తన తండ్రిని పరిచయం చేశాడు. వీరసింహుడు తనకు చిత్రసేనుడు చేసిన సహాయం సంగతి తారకేశ్వరుడితో వివరంగా చెప్పి, ''ఇక నేను రాజ్యపాలనా భారం వదులుకోదలిచాను. నాకు పుత్రులు లేరు. ఉన్నది ఒక్కగా నొక్క కుమార్తె మీతో వియ్యమందాలని వున్నది,'' అన్నాడు.

తారకేశ్వరుడు అంతకు పూర్వమే రాకుమార్తె కాంతిమతిని చూశాడు. చిత్రసేనుడు ఆమెను ప్రేమించివున్నట్టు కూడా




సైనికుల సంభాషణనుబట్టి గ్రహించాడు. ఒక్క దెబ్బతో తన కుమారుడు ప్రేమించిన రాకుమార్తెను వివాహమాడటమేగాక, తన రాజ్యాన్ని కూడా రెండింతలు చేసుకోగలడు. ఈ కారణాలవల్ల తారకేశ్వరుడు చిత్రసేన కాంతిమతుల వివాహానికి పరమానందంగా వెంటనే అంగీకారం తెలియపరిచాడు.

త్వరలోనే వివాహ ముహూర్తం నిర్ణయింపబడింది. వివాహం రోజున చిత్రసేనుడు సైనికులకూ, సేనానాయకులకూ చక్కటి బహుమానా లిచ్చాడు. అతడు ముఖ్యంగా తనకు మొదటి నుండి ఎన్నో విధాల సహాయపడిన, ఉగ్రాక్షుడికి ఏదైనా

విలువైన బహుమానం యివ్వాలను కున్నాడు.

"ఉగ్రాక్షా, నువ్వు నాకు చేసిన సహాయం అమూల్యమైనది. నేనూ, కాంతిమతీ కూడా నీకు చాలా కృతజ్ఞులం. ఈ వివాహ సందర్భంలో నీకు ఎలాంటి బహుమానం కావాలో కోరుకో," అన్నాడు చిత్రసేనుడు.

"మహారాజా, మీరు మరోసారి ఆలోచించుకుని వాగ్దానం చెయ్యండి. నేను కోరబోయే బహుమానం మీకు కష్టం కలిగించవచ్చు." అన్నాడు ఉగ్రాక్షుడు.

"అలాంటిదేం వుండదు, కోరుకో!" అన్నాడు చిత్రసేనుడు.

"మహారాజా, నేను మిమ్మల్ని మొట్టమొదటగా కోరినకోర్కె, మీకు పుట్టబోయే పిల్లల్లో పెద్దవాణ్ణి పద్దెనిమిదో ఏడు రాగానే నాపరం చెయ్యమని. కాని, ప్రస్తుతం కొన్ని కారణాలవల్ల నా మనస్సు మార్చుకున్నాను. ఇప్పుడు నేను కోరేదేమిటంటే, మీకు పుట్టబోయే ప్రథమ సంతానం మగపిల్లవాడైనా, ఆడపిల్ల అయినా సరే—అయిదో ఏటనే నా పరం చెయ్యాలని." అన్నాడు ఉగ్రాక్షుడు.

ఈ కోరిక వింటూనే చిత్రసేనుడు నిర్విణ్ణుడయాడు. కాని, అంతలోనే అతడికి ఒక ఆలోచన వచ్చింది. తన ప్రథమ సంతానాన్ని ఏదో ఒకనాడు రాక్షసుడికి ఒప్పచెప్పవలసి రావటం తప్పనప్పుడు—అది పద్దెనిమిదో ఏట అయితేనేం? అయిదో ఏట అయితేనేం?

"ఉగ్రాక్షా, నువ్వు కోరిన విధంగానే జరుగుతుంది." అన్నాడు చిత్రసేనుడు గంభీరంగా

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు ఎక్కడ లేని ఆనందంతో ఉప్పొంగిపోతూ, "మహారాజా, నేను సర్వదా తమ దాసానదాసుణ్ణి!" అంటూ అతడికి ప్రణమిల్లి లేచి, తన సేవకుల కేసి తిరిగి, "ఒరే, బంట్లూ, అంతా యిక్కడే వున్నారా?" అని గట్టిగా హుంకరించాడు. —(ఇంకావుంది)






# ఇద్దరు దేవతలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ, అతి కష్టతరమైన కార్యానికి, నిన్ను పురిగొల్పినవాడెవడో అల్పుడైవుంటాడని, నా నమ్మకం. లోకంలో కొందరు అల్పులకు అధికార బలమేకాదు; అపూర్వశక్తులు కూడా వుండడం, వింతవిషయమేమీ కాదు. నువ్వు, అలాంటి వాడెవడో ఒకడి ప్రభావానికి గురి అయివుండవచ్చు. ఇందుకు ఉదాహరణగా, నీకు ఇద్దరు దేవతల కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

శిలాపురి రాజ్యానికి సరిహద్దు ప్రాంతమైన అరణ్యసమీపాన, రెండు దేవాలయా

## బేతాళ కథలు



లుండేవి. అందులోని ఒక దేవాలయంలో అంకమాంబ అనే దేవతా, రెండవదానిలో జగదాంబ అనే దేవతా వుండేవాళ్ళు.

ఈ ఇద్దరి దేవతలలో, అంకమాంబకు, తన దగ్గిరకు వచ్చిన భక్తులలో, రోజుకు ఇద్దరి కోరికలు తీర్చగలశక్తి వుండేది. జగదాంబ మాత్రం, రోజుకు ఒక భక్తుడి కోరిక మాత్రమే తీర్చగలిగేది.

ఈ కారణం వల్ల, అంకమాంబ ఆలయం, ఎప్పుడూ వచ్చేపోయే భక్తులతో నిత్యనూతనంగా కళకళలాడుతూండేది. జగదాంబ ఆలయానికి ఎక్కువమంది భక్తులు వెళ్ళేవారు కాదు. ఇందువల్ల, అంకమాంబకు చాలా గర్వంగా వుండేది. జగదాంబకన్న, తాను గొప్పదానినన్న అహంభావంతో విర్రవీగేది.

ఎప్పుడైనా రాత్రివేళల్లో ఆమె, జగదాంబను కలిసినప్పుడు, ఎంతో హుందాగా, "జగదా, నిన్ను చూస్తూంటే, నాకు చాలా జాలి కలుగుతూంటుంది. నా దగ్గిరకు వచ్చే భక్తులలో, పదోవంతు కూడా, నీ దగ్గిరకు రావడం లేదు. పాపం, నీకెంత బాధగా వుంటుందోమరి!" అనేది.

అందుకు జగదాంబ, "ఇందులో బాధ పడవలసిందేమీలేదు. నీవైనా, నేనైనా భక్తుల క్షేమాన్నేగదా కోరేది," అని శాంతంగా జవాబిచ్చేది.

జగదాంబ అలా అనడం అంకమాంబకు చాలా నిరుత్సాహం కలిగించేది. అలా కాక, ఆమె తన గొప్పతనాన్ని ప్రస్తుతిస్తే, వినాలని అంకమాంబ గాఢమైన కోరిక.

ఒక రోజున అంకమాంబ ఆలయానికి, శిలాపురి రాజు శరశ్చంద్రుడు గుర్రం మీద ఒంటరిగా వచ్చాడు. ఆయన ఆలయం ముందు గుర్రం దిగి, ఆలయంలోకి పోయి, అంకమాంబ విగ్రహానికి ప్రణమిల్లి, "తల్లీ, నీ మహిమలు, నాకు తెలియనివికావు. ఇప్పుడు నిన్నొక కోరిక, కోరుతున్నాను. నేను త్వరలో, పొరుగు రాజు సత్యపాలుడి పైకి దాడిపోబో

తున్నాను. యుద్ధంలో ఎంత ప్రాణనష్టం, ధననష్టం కలిగినా, నేను లెక్కచేయను. విజయలక్ష్మి మాత్రం తప్పక నన్నే వరించేటట్టు చూడు!" అని కోరుకుని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొద్దిసేపటికి, బ్రహ్మరుద్రుడనే బందిపోటుదొంగ అక్కడికి వచ్చి, అంకమాంబకు భక్తితో నమస్కరించి, "మహిమగలతల్లీ! నేనీ రోజున, శిలాపురి నగరంలో, ఒక ధనికుడి ఇంట జరుగుతున్న పెళ్ళికి, నా అనుచరులతో వెళ్ళి, అక్కడున్న వారినందరినీ దోచాలనుకుంటున్నాను. నా ప్రయత్నం నిరాఘాటంగా సాగేట్టు, అనుగ్రహించు, తల్లీ!" అని కోరుకుని, వెళ్ళిపోయాడు.

మరి కొంతసేపటికి, సమీపారణ్యంలో తిరుగాడే, రక్తభైరవు డనే రాక్షసుడు, ఆలయానికి వచ్చి, "తల్లీ, నాలుగు రోజులుగా, నరమాంసం దొరక్క, ఆకటితో అలమటించిపోతున్నాను. తక్షణం, నాకు నలుగురు మనుషులు ఆహారంగా లభించేటట్టూ—ఆ తర్వాత ప్రతి దినం నరమాంసం దొరికేటట్టూ, అనుగ్రహించు!" అని కోరుకుని, అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

రాజు, దొంగ, రాక్షసుడి కోరికలు విన్న అంకమాంబ, ఆ కోరికలలో వున్న అధర్మం, అన్యాయాలను గుర్తించింది. అందువల్ల, వాళ్ళ కోరికలు తీర్చరాదని నిశ్చయించుకుని, మరెవరైనా భక్తులు





వస్తారేమో అని ఆ రోజంతా ఎదురు చూడ సాగింది.

అయితే, చిత్రంగా ఆ ముగ్గురూ తప్ప, ఆ రోజున ఆమె ఆలయానికి, వేరే భక్తులెవరూ రాలేదు. దానితో అంకమాంబకు, ఒక గడ్డుసమస్య ఎదురయింది.

ఆమె ప్రతి రోజూ, తన దగ్గిరకు వచ్చే భక్తులలో, ఇద్దరి కోరికలు తప్పనిసరిగా నెరవేర్చాలి. అలా జరగనప్పుడు, ఆమె మహిమలు మరెన్నడూ పని చెయ్యవు! రాజు, దొంగ, రాక్షసుడి కోర్కెలు తీర్చడం, ఆమెకు యిష్టం లేదు. అలా అని, తన మహిమలు పోగొట్టుకోవడం కూడా, ఆమెకు యిష్టం లేదు.

ఈ సమస్యను పరిష్కరించడం ఎలాగా అని, ఆమె ఆలోచిస్తూండగా, జగదాంబ గుర్తుకు వచ్చింది. ఆమె, ఆ రాత్రి జగదాంబను చూడబోయి, "జగదా, నాకిప్పుడొక క్లిష్టసమస్య ఎదురయింది. దానికి నీవేమైనా పరిష్కారమార్గం చూపెట్టగలవేమో అని వచ్చాను," అన్నది.

"ఏమిటా క్లిష్టసమస్య?" అని అడిగింది జగదాంబ.

అంకమాంబ, తన దగ్గిరకు వచ్చిన రాజు, దొంగ, రాక్షసుడి కోర్కెల గురించి ఆమెకు చెప్పి, "వాళ్ళ కోర్కెలు యితరులకు చాలా హానికరమైనవి. అవి తీర్చడం, నా కిష్టం లేదు. నీకు తెలుసుగదా— ప్రతి రోజూ యిద్దరు భక్తుల కోర్కెలు నెరవేరేలా చేయకపోతే, నా మహిమలు నశిస్తాయి. చిత్రంగా ఈనాడు ఆ ముగ్గురూ తప్ప, భక్తులు మరెవరూ రాలేదు. ఈ పరిస్థితిలో, వాళ్ళ కోర్కెలు తీర్చాలో, నా మహిమలు పోగొట్టుకోవాలో తెలియడం లేదు," అన్నది.

అంతా విన్న జగదాంబ, "నువ్వేమీ విచారపడకు. నేను చెప్పినట్టు చేశావంటే, నువ్వు వాళ్ళ కోర్కెలు తీర్చనవసరం లేదు. నీ మహిమలు, నీతోనే వుంటాయి," అని చెప్పింది.

ఆ జవాబు విని, అంకమాంబ ఆశ్చర్య పోతూ, "అదెలా సాధ్యం?" అని అడిగింది.

"వాళ్ళ కోర్కెలు నెరవేర్చకు. అందువల్ల, నీ మహిమలు కోల్పోతావు. అప్పుడు, నీ మహిమలు తిరిగిరావాలని, నన్ను కోరు. రోజు కొకరి కోర్కె నెరవేర్చగల శక్తి గలిగిన నేను, నీ మహిమలు నీకు తిరిగి వచ్చేలా చేస్తాను." అన్నది జగదాంబ నెమ్మదిగా.

ఈ మాటలు విని, అంకమాంబ ఆలోచనలో పడింది. తాను చాలాసార్లు జగదాంబ దగ్గిర, గొప్పదాన్ననే గర్వం, మిడిసిపాటు ప్రదర్శించింది. ఇప్పుడు తను, ఆ ముగ్గురి కోర్కెలూ నెరవేర్చక, మహిమలు పోగొట్టుకుంటే, జగదాంబ తన మీది ఈర్ష్యకొద్దీ, తన కోరిక నెరవేర్చక పోతే, తన గతేంకాను? తనలో మహిమలు లేవని తెలుసుకున్న భక్తులు, జగదాంబ ఆలయానికి వెళతారు. ఆపైన తన పూర్వ వైభవాన్ని తలచుకుంటూ కుమిలి పోవాలి!

అంకమాంబ, ఇలా మనసులో కొంత సేపు మథనపడి, తర్వాత ఒక నిర్ణయానికి వచ్చి, ఏమైతే అది అవుతుందనుకుంటూ, "ఈ రోజు, నాదగ్గిరకు వచ్చిన ముగ్గురి కోరికలూ, నెరవేరకుండు గాక!" అన్నది.

ఆ మరుక్షణం, ఆమె శరీరంనుంచి, శక్తి నిష్క్రమించింది. ఆమె ముఖంలోని



దివ్యతేజస్సు మాయమై, ముఖం కళా విహీనమైంది.

అది గ్రహించిన అంకమాంబ, జగదాంబతో, ''జగదా, పోయిన నా శక్తులు ప్రసాదించు!'' అని చేతులు జోడించింది.

''తథాస్తు!'' అని దీవించింది జగదాంబ.

ఆ వెంటనే, అంకమాంబ ముఖం దివ్య తేజస్సుతో ప్రకాశించింది.

బేతాళుడు ఈ కథ చెప్పి ''రాజా, అంకమాంబకు అపూర్వశక్తులూ, మహిమలూ వుండుగాక. కాని, గతంలో జగదాంబపట్ల, ఆమె ప్రవర్తన గమనించినప్పుడు, ఆమె అల్పురాలని తెలుస్తూనే వున్నది. అటువంటిదానికి జగదాంబ, ఏ ప్రభావానికి లోనై శక్తులు ప్రసాదించింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అంకమాంబ గతంలో, అల్పబుద్ధి అనే మాట నిజం. అయితే, ముగ్గురు స్వార్థపరులు, ఆమెను కోరిన వరాలు, తప్పకుండా ప్రజాక్షయానికి దారి తీయగలవని గుర్తించిన మరుక్షణం, ఆమెలో గొప్ప మార్పు వచ్చింది. వాళ్ళ కోర్కెలు నెరవేర్చకపోతే, తన మహిమలు పోగలవని తెలిసి కూడా, ఆమె అందుకు సిద్ధపడింది. ఇది ఎంతో నిస్వార్థతా త్యాగబుద్ధిగలవాళ్ళు మాత్రమే చేయగల పని. ఇక జగదాంబ స్వతహాగా సుగుణవంతురాలు. తన సాటి దేవతకు సాయపడినందువల్ల, ఆమెకు కలగబోయే హాని ఏమీ లేదు. ఆ కారణం వల్ల ఆమె చేసిన పని గొప్ప త్యాగం అనిపించుకోదు. అందువల్ల, ఈ ఇద్దరు దేవతల్లో, ఎవరో ఒకరు మరొకరి ప్రభావానికి లోనుకావడం అన్న ప్రసక్తిలేదు. అంకమాంబ చేసిన త్యాగం అన్ని విధాలా ఎంతో ప్రశంసనీయమైనది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# మంత్రియుక్తి

మణిపుర రాజు తన కూతురు మాణిక్యదేవికి జన్మదినపు కానుకగా ఒక నవరత్న హారం చేయించాడు. అది ఎన్నో వందల మణులలో నుంచి నిపుణులు ఏర్చి కూర్చిన నవరత్నాల హారం, చాలా విలువైనది. అలాటి హారం కాస్తా ఒకరాత్రి వేళ దొంగిలించబడింది.

ఎక్కడో అంతఃపురంలో పడుకున్న రాజకుమార్తె మెడలోని హారాన్ని, బయటి నుంచి వచ్చినవాళ్ళు దొంగిలించే అవకాశం లేదు. రాజభవనంలో ఉండే వాళ్ళలోనే ఎవరో ఆ పని చేశారు.

ఒక్కొక్కరినీ పిలిచి అడిగితే నిజం బయటపడదు. ప్రతి ఒక్కరినీ పిలిచి, "నువ్వే దొంగతనం చేసి ఉంటావు!" అన్న ధోరణిలో ప్రశ్నలు వేస్తూపోతే, ప్రశ్నించే వాడి అసమర్థత మాత్రమే బయటపడుతుంది.

అందుచేత మంత్రి దొంగను పట్టుకోవటాని కొక యుక్తి పన్నాడు. అయన మధ్యాన్నానికి ముందుగానే తన మనుషులకు ముగ్గురికి ఏం చెయ్యవలసినదీ చక్కగా బోధ చేశాడు.

మధ్యాన్నం దాటినాక మంత్రి రాజభవనపు సావడిలో అందరినీ సమావేశపరిచి, "రాత్రి ఎవరో మనలోవాళ్ళే రాజకుమార్తె నవరత్నహారం కాజేశారు. దొంగతనం చేసినవాళ్ళు వెంటనే హారం తెచ్చి ఇస్తే ఈసారికి వాళ్ళను కరుణించి క్షమిస్తాను. లేని పక్షంలో వాళ్ళు దుర్భరమైన బాధపడి చస్తారు. ఈ విషయం మీకు నేను ముందే చెప్పాను." అన్నాడు. ఎవరూ మాట్లాడలేదు.

ఇంతలోనే ఆ ప్రదేశానికి ఒక భూతవైద్యుడు లాటి మాంత్రికు డొకడు హడావిడిగా వచ్చాడు.

"దయచెయ్యండి, స్వామీ! మీ మంత్రశక్తి అవసరమయ్యే లాగే కనబడుతుంది," అని ఆ భూతవైద్యుణ్ణి సగౌరవంగా ఆహ్వానించాడు.

అదే సమయంలో ఒక వర్తకుడి వేషంలో ఉన్న మనిషి దూరం నుంచి హడావిడిగా రొప్పుతూ పరిగెత్తుకుంటూ వచ్చి, "మహామంత్రీ, రక్షించండి! నిన్న రాత్రి నా ఇంట దొంగలు పడి పదివేల రూపాయలు కాజేశారు!" అంటూ మంత్రి కాళ్ళ పైన పడిపోయాడు.

మంత్రి వెంటనే భూతవైద్యుడి కేసి తిరిగి, "స్వామీ, ఈ వర్తకుడి ఇల్లు దోచిన దొంగను ముందు అంతు తేల్చండి. ఇంటి దొంగ సంగతి తరవాత నిదానంగా చూడవచ్చు," అన్నాడు.

భూతవైద్యుడు వెంటనే తన కమండలం నుంచి ఇన్ని నీళ్ళు తీసి, "హ్రీం! హ్రీ!" అంటూ ఏదో మంత్రాలు చదివి ఆ జలాన్ని అక్కడ చేరిన వారిపైన చల్లాడు. వెంటనే వారిలో ఒకడు కెవ్వున అరిచి, కిందపడి యమయాతన పడుతూ గిలగిలా తన్నుకోసాగాడు. వాడంత బాధలోనూ, "చంపకండి! నేనే దొంగతనం చేశాను. సొమ్మిచ్చుకుంటాను!" అని మూలిగాడు.

"వాణ్ణి అలా తన్నుకోనివ్వండి, స్వామీ. పనిలో పని నవరత్నహారం దొంగిలించిన మనిషిని కూడా వెంటనే మంత్రించండి," అన్నాడు మంత్రి.

వెంటనే ఒక దాసీది ముందుకు వచ్చి మంత్రి కాళ్ళ పైన పడి, "క్షమించండి మహాప్రభూ! గడ్డి తిని నేనే ఆ హారాన్ని దొంగిలించాను. నన్ను కాపాడండి!" అంటూ ఏడవసాగింది.

వెంటనే కిందపడి మూలుగుతూ పొర్లుతున్నవాడు నవ్వుతూ లేచి కూర్చున్నాడు. భూతవైద్యుడూ, వర్తకుడూ కూడా తమ వేషాలు విప్పేశారు.

వాళ్ళు ముగ్గురూ మంత్రి మనుషులే. వాళ్ళు ఆడిన నాటకం మూలానే పోయిన నవరత్నహారం తిరిగి దొరికింది.



మనదేశపు అద్భుతాలు :

# ఎర్రకోట




మన రాజధాని ఢిల్లీ నగరంలోని ఎర్రకోట ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన భవనం. అత్యంత వైభవానికీ,ఎన్నో విషాద సంఘటనలకూ సాక్షిగా వెలుగొందిన ఈ కోటను, సుప్రసిద్ధ చరిత్రకారుడు ఫెర్గూసన్ "తూర్పు దేశాలలో, బహుశా ప్రపంచంలోనే దేదీప్యమైన భవనం," అని వర్ణించాడు.



ఎన్నో అద్భుతమైన స్మారక భవనాలను నిర్మించిన షాజహాన్‌చక్రవర్తి, ఈ కోటను నిర్మించాడు. షాజహాన్ తన రాజధానిని ఆగ్రానుంచి ఢిల్లీకి మార్చి, 1638వ సంవత్సరం ఈ కోట నిర్మాణం ప్రారంభించి పదేళ్ళలో పూర్తి చేశాడు.

భూకంపానికీ, దురాక్రమణదారుల దాడులకూ గురై, ఎర్రకోటలోని అనేక భవనాలు నాశనమయ్యాయి. అయినా ఈనాటికీ ఇంకా ఎన్నో అద్భుత భవనాలు చెక్కుచెదరకుండా నిలిచి ఉన్నాయి. చాందినీచౌక్‌కు అభిముఖంగా ఉన్న లాహౌర్‌గేట్ అటువంటి అద్భుత భవనాలలో ముఖ్యమైనది.






మయూరసింహాసనంతో, విలువైన వజ్ర వైడూర్యాలతో వెలుగొందిన ఎర్రకోట వైభవం అంతిమ దశకు వచ్చింది. షాజహాన్ మంచం పట్టగానే, దురాశాపరుడైన, అతడి మూడవ కుమారుడు ఔరంగజీబు, సింహాసనానికి వారసుడైన, పెద్దకొడుకు దారాను బంధించి వీధులగుండా లాక్కుపోయి హతమార్చాడు !

ఔరంగజీబుతో మొగలు సామ్రాజ్య పతనం ప్రారంభమయింది. అదే మంచి అదనుగా భావించి పర్షియారాజు నాదిర్షా, 1739వ సంవత్సరంలో ఢిల్లీపై దండయాత్ర చేశాడు. తన వెంట వంద ఏనుగులు ఊరేగింపు రాగా, నాదిర్షా ఎర్రకోటలో జొరబడి మహమ్మదు షా భవనాన్ని ఆక్రమించుకున్నాడు!





ఆరోజు సాయంకాలం, నాదిర్షా సైనికులు కొందరు దుకాణాలను దోచుకోసాగారు. వ్యాపారులు కొందరు నాదిర్షా సైనికులను హతమార్చారు. ఈ వార్త అందగానే నాదిర్షా, నగర పౌరులందరినీ హతమార్చమని తన సైనికులకు ఆజ్ఞాపించాడు. ఆడ, మగ, పిల్లలు అనే విచక్షణ పాటించకుండా నాదిర్షా సైనికులు ఇరవై వేల మంది పౌరులను వధించారు.

నాదిర్షా అపూర్వ ధనరాసులతో, స్వదేశానికి తిరిగి వెళ్ళాడు. అయినా, ఆ తరవాత కూడా ఎర్రకోట మరెన్నో దురాక్రమణలకు గురి అయింది. 1788వ సంవత్సరంలో రోహిల్లాలు ఢిల్లీని పట్టుకున్నారు. ఎర్రకోటలో వారు ఆశించిన ధనరాసులు లేకపోయేసరికి ఘులామ్ ఖదీర్ ఆగ్రహించి షా ఆలమ్ చక్రవర్తి కళ్ళను కత్తితో పొడిచాడు.





1857వ సంవత్సరంలో బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకంగా సిపాయిల తిరుగుబాటు జరిగింది. తిరుగుబాటు జరుపనున్న సిపాయిలు ఎర్రకోట ముందు సమావేశమై, చివరి మొగలుచక్రవర్తి బహదూర్ షా జఫార్ ఆశీస్సులను కోరారు. వృద్ధ చక్రవర్తి వాళ్ళకు తన మద్దతును తెలియజేశాడు. కాని, తిరుగుబాటు విఫలమయింది. షా జఫార్, దోషిగా పరిగణించబడి ఎర్రకోటనుంచి బర్మాకు తరలించబడ్డాడు.

1945వ సంవత్సరంలో సుభాష్ చంద్రబోస్ స్థాపించిన, భారత జాతీయ సైన్యం మీద ఎర్రకోటలో విచారణ జరిగింది. నిందితుల తరఫున నెహ్రూ, సర్దార్ పటేల్, అసఫ్ అలీ, తేజ్ బహదూర్ సప్రూ, బులాభాయ్ దేశాయ్ మొదలైన ప్రముఖ నాయకులు హాజరయ్యారు. సైన్యాధికారులు ముగ్గురు దోషులుగా నిర్ణయించబడ్డారు. అయినా శిక్ష అమలు కాలేదు.





1947 ఆగస్టు 15 వ తేదీన మనకు స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు, మన తొలి ప్రధాని జవహర్లాల్ నెహ్రూ ఎర్రకోట ఆవరణలో జాతీయ పతాక ఆవిష్కరణ చేశాడు. చరిత్ర ప్రసిద్ధి గాంచిన ఎర్రకోట, మన స్వాతంత్ర్య సముపార్జనతో సైతం సంబంధం కలిగి ఉండడంవల్ల, మరింత ప్రాముఖ్యతను సంతరించుకున్నది!



# తాను తవ్విన గోతిలో...

అయిదు వందల ఏళ్ళ క్రితం హంగరీలో ధర్మాత్ముడని పేరుపడిన మాత్యాస్ అనే రాజు పరిపాలించిన కాలంలో, రాజధానికి కొంత దూరంలోని ఒక గ్రామంలో ఒక ధనికుడు ఉండేవాడు. ఆ ధనికుడికి నయవంచన పుట్టుకతో వచ్చిన విద్య. ఇతరులను కష్టాలపాలు చేసి చూడడం ఆయనకు సరదా. అబద్ధాలు చెప్పి సాటి వాళ్ళకు గోతులు తవ్వి, తన మాటలు నమ్మి వాళ్ళు అందులో పడితే ఆయన అది చూసి ఆనందించేవాడు.

ఒకసారి అయన రాజధానికి వెళ్ళి, ఏవో బేరాలు చేసి సంచీడు బంగారు నాణాలతో తిరిగి వచ్చి, గ్రామంలో ప్రతి వాడితోనూ తాను కుక్కలను అమ్మి అంత బంగారమూ సంపాదించాననీ, అక్కడ కుక్కలకు వల్లమాలిన గిరాకీ ఉన్నదనీ చెప్పాడు.

ఈ మాట విన్న ఒక నిరుపేదవాడు, ధనికుడు చెబుతున్న అబద్ధాలు ఎవరో చెప్పుకుంటూ ఉండగా విని, తాను కూడా నాలుగు డబ్బులు చేసుకుందామన్న ఆశతో ధనికుడి వద్దకు వచ్చి, ''కుక్కల అమ్మకాన్ని గురించి నేను విన్నది నిజమేనా, బాబుగారూ?'' అని అడిగాడు.

''అవును రా! మాత్యాస్ మహారాజుగారు కుక్కలను ఎడా పెడా కొనేస్తున్నాడు! వాటికి మంచి ధర కూడా ఇస్తున్నాడు. ఈ సంగతి తెలియగానే నేను ఎవరికీ చెప్పకుండా నా దగ్గర ఉన్న డబ్బంతా పెట్టుబడి చేసి కుక్కలను కొని, వాటిని రాజధానికి తీసుకుపోయి రాజుగారికి మంచి ధరకు అమ్మాను. ఆ బేరంలో సంచీడు బంగారం సంపాదించుకున్నాను. పాపం, నువు పేదవాడివి గద. డబ్బు

హంగరీ జానపద కథ



చేసుకోదలిస్తే రాజుగారికి కుక్కలను అమ్ము. ఆయనకు ఎన్ని కుక్కలైనా కావాలట! అందుచేత ఆయన ఇంకా చాలా కుక్కలను కొనబోతున్నాడు,'' అన్నాడు ధనికుడు.

పేదవాడు ఈ మాటలు పూర్తిగా నమ్మాడు. వాడికి, పాపం, డబ్బు చేసుకోవాలన్న తహ తహ పుట్టుకొచ్చింది. కాని, వాడి దగ్గిర పెట్టుబడికి డబ్బు ఏమీ లేదు. అమ్ముదామన్నా ఒక బక్కచిక్కిన ఆవు తప్ప వాడివద్ద మరేదీ లేదు. అయినా ఇంత మంచి అవకాశాన్ని దాటి పోనివ్వరాదని వాడు ఆ బక్క ఆవును సంతకు తీసుకుపోయి అమ్మి, కొన్ని కుక్కలను కొని, వాటి మెడలకు తాళ్ళు కట్టి రాజధానికి తీసుకుపోయాడు.

కాని వాడు రాజభవన ద్వారం చేరినాక ద్వారపాలకులు వాణ్ణి లోపలికి పోనివ్వలేదు. ధనికుడు తనను నిష్కారణంగా దగా చేసినట్టు అప్పుడు, వాడికి అర్థమయింది. తనను చూసి రాజభటులు పరిహాసంగా నవ్వుతుంటే పేదవాడు పట్టరాని దుఃఖంతో ఏడవసాగాడు.

రాజభవనం పైభాగం నుంచి రాజుగారు, కుక్కలను వెంట బెట్టుకుని ఉన్న ఒక పేదవాడు ఏడుస్తూ ఉండటం చూసి, విషయం తెలుసుకోగోరి, కుక్కలను వెంటబెట్టుకు వచ్చిన మనిషిని తన వద్దకు తీసుకు రమ్మని ఒక సేవకుణ్ణి ఆజ్ఞాపించాడు.

పేదవాడు రాజుగారి వద్దకు వెళ్ళి, తన గ్రామంలోని ధనికుడు తనకు అబద్ధం చెప్పి ఎలా మోసం చేసినదీ వివరంగా చెప్పాడు.

రాజుకు వాణ్ణి చూస్తే ఎంతో జాలి కలిగింది. ఆయన తాను కుక్కలను కొంటున్న మాట నిజమే నని చెప్పి, పేదవాడికి నూరు బంగారు నాణాలు ఇప్పించి, కుక్కలను విడిపించి, ధనికుడి పేరు అడిగి కనుక్కొని వాణ్ణి పంపేశాడు.

పేదవాడి ఆనందానికి మేరలేదు. వాడు అప్పటికప్పుడే బయలుదేరి తన గ్రామానికి తిరిగి వెళ్ళి, తాను రాజుగారి దగ్గర సంపాదించుకున్న బంగారాన్ని పరమానందంతో అందరికీ చూపించాడు.

ఆ పేదవాడు తన మాట విని నలుగురిలోనూ నవ్వులపాలు అవుతాడనుకుంటే, వాడు నిజంగానే కుక్కల బేరం చేసి బంగారం తెచ్చుకున్నందుకు ధనికుడికి అమితమైన ఆశ్చర్యం కలిగింది. తాను వేళాకోళానికి అన్న మాట అక్షరాలా నిజమయింది.

ధనికుడికి చూస్తూ కూచో బుద్ధి పుట్టలేదు. వెంటనే ఆయన తనకున్నదంతా అమ్మేసి, ఆ డబ్బుతో వేలకొద్దీ కుక్కలను కొని, వాటిని తిన్నగా రాజధానికి తోలుకుపోయి, రాజభవనం వద్ద ద్వారపాలకులతో తగాదా పెట్టుకున్నాడు. ద్వారపాలకులు ఆయననూ, కుక్కలనూ భవనం లోపలికి పోనివ్వలేదు. ధనికుడు గట్టిగా కేకలు పెట్టాడు. ద్వారపాలకులు అంతకన్న గట్టిగా కేకలు పెట్టారు. కుక్కలు అరిచాయి.

ఈ సందడి అంతా ఏమిటా అని రాజుగారు మేడ మీది నుంచి చూసి, ఆ మనిషినీ, కుక్కలనూ లోపలికి రానివ్వమని సేవకులతో అన్నాడు.

ధనికుడు రాజుగారితో తాను కుక్కల బేరం మీద వచ్చినట్టు చెప్పాడు.

ధనికుడి పేరు వినగానే, పేదవాణ్ణి మోసం చేసినది ఆయనేనని రాజుగారికి తెలిసిపోయింది. ఆయన ధనికుడితో, "నేను కుక్కలను ఒక్కసారే కొన్నాను. ఇంక నాకు కుక్కల అవసరం లేదు. నువు సమయం దాటి వచ్చావు. పాపం!" అన్నాడు.

ధనికుడు రాజధానికి ఎలా వెళ్ళాడో అలాగే స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. కాకపోతే ఆయన ఆస్తి అంతా పోయింది. ఆయన చేసిన కుక్కల వ్యాపారం గురించి ప్రజలు చాలా కాలం చెప్పుకుని ఎంతో ఆనందించారు.



# మానవత్వం

ఒక రాజ్యంలో, క్రమక్రమంగా క్షయరోగుల సంఖ్య పెరగసాగింది. ఆయా ప్రాంతాలగల రాజోద్యోగులు, రాజుకు ఒకటికి రెండుసార్లు, లేఖలూ, వినతిపత్రాలూ పంపారు. కాని, రాజు వాటినేమీ పట్టించుకోకుండా పూరుకున్నాడు.

చివరకు ఆ వ్యాధి, రాజధానీ నగరంలోనే ప్రారంభమైంది. చాలామంది పౌరులు దాని వాత పడ్డారు. రాజు అప్పుడు కళ్ళు తెరచి, నగరంలో ఒక పెద్ద క్షయవ్యాధి చికిత్సాలయం కట్టించాడు. దాని ప్రారంభోత్సవం, తమ కులగురువుచేత చేయించాలన్న ఆలోచన ఆయనకు కలిగింది. అయితే, కులగురువు ఎక్కడో అరణ్యంలో తపస్సు చేసుకుంటున్నాడు.

రాజు ఆయన్ని దర్శించి, సంగతి చెప్పి, "ప్రారంభోత్సవం, తమ చేతుల మీదుగా జరగాలన్నది, నా కోరిక," అన్నాడు.

అందుకు కులగురువు, "రాజా, నేను క్షయవ్యాధి చికిత్సాలయ ప్రారంభోత్సవానికి కాదు, దాన్ని మూసివేసే రోజున వస్తాను!" అన్నాడు తిరిగి కళ్ళు మూసుకుని ధ్యానంలోకి పోతూ.

క్షయవ్యాధి పూర్తిగా నిర్మూలనం అయితే గాని, రాజ్యంలోకి తాను అడుగుపెట్టనన్న కులగురువు అభిప్రాయం అర్థమయేసరికి రాజు కళ్ళు చెమ్మగిల్లాయి.

—డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్





# ఉత్తరరామాయణం

అగస్త్యుడు రాముడికి వాలి సుగ్రీవుల కథ ఇలా చెప్పాడు:

మేరుపర్వతం మీది మధ్యశిఖరం దేవతలకు కూడా ఎంతో పవిత్రమైనది. ఆ శిఖరం మీద సువిశాలమైన బ్రహ్మసభ ఉన్నది.

ఒకసారి బ్రహ్మ యోగాభ్యాసం చేస్తూ, కంటి నుండి కారిన నీటిని విదిల్చేసరికి, దాని నుంచి ఒక వానరుడు పుట్టాడు. బ్రహ్మ ఆ వానరుణ్ణి కొంత కాలంపాటు తన వద్దనే ఉండమనీ, మేరుపర్వతం మీది దుంపలూ, పళ్ళూ తింటూ ఉండమనీ అన్నాడు. అది మొదలు ఆ వానరుడు పగలల్లా చెట్ల మీద సంచరిస్తూ, పళ్ళు తింటూ గడిపి, సాయంకాలం కాగానే మంచి మంచి పూలూ, పళ్ళూ తీసుకుని బ్రహ్మవద్దకు వస్తూండేవాడు.

ఇలా చాలా కాలం గడిచింది. ఒకనాడా వానరుడికి దాహం కలిగింది. అతను మేరుపర్వతం యొక్క ఉత్తర శిఖరానికి వెళ్ళాడు. అక్కడ అనేక పక్షులతో కూడిన సరస్సొకటి కనిపించింది. వానరుడు తన శరీరమంతా ఒక్కసారి విదుల్చుకుని, నీటిదగ్గిర కూర్చుని, తన దాహం తీర్చుకునేటందుకుగాను నీటిలోకి తొంగి చూసేసరికి, అందులో అతని ప్రతిబింబం కనిపించింది. నీటిలో తన శత్రువైన మరొక వానరుడు దాగి ఉన్నాడనీ, వాడి అంతు కనుక్కోవాలనీ అనుకుని వానరుడు నీటిలోకి చెంగున దూకి, సరస్సంతా

8. సీతా పరిత్యాగం



ఎంతో వెతికాడు. లోపల మరొక వానరుడు కనిపించకపోయేసరికి అతను ఒడ్డుకు తిరిగి వచ్చాడు.

ఒడ్డుకు చేరిన మరుక్షణమే ఆ వానరుడు ఒక అందమైన ఆడదిగా మారి పోయాడు.

జగన్మోహనమైన రూపంతో ఆ ఆడది అక్కడే కూర్చుని ఉండగా, ఇంద్రుడూ, సూర్యుడూ బ్రహ్మను చూసి వెళ్ళిపోతూ అటుగా వచ్చారు. ఇద్దరి కళ్ళూ ఒకేసారి ఆమె పైన పడ్డాయి. ఇద్దరికీ ఆమె పైన ప్రేమ కలిగింది. వారిద్దరి వల్లా ఆమె గర్భవతి అయి, వాలి సుగ్రీవులను కన్నది. ఇంద్రుడు తన కొడుకైన వాలికి బంగారు తామరల మాలను కానుకగా ఇచ్చాడు. సూర్యుడు తన కొడుకైన సుగ్రీవుడికి హనుమంతుణ్ణి స్నేహితుడుగా నిరూపించాడు.

తరవాత ఆ వానరుడికి స్త్రీ రూపం పోయి తిరిగి మామూలు రూపం వచ్చేసింది. అతనే తన కొడుకు లిద్దరినీ పెంచాడు. అతనే ఋక్షరజసుడు. బ్రహ్మ దేవుని ఆజ్ఞపైన ఋక్షరజసుడు తన కొడుకు లిద్దరినీ తీసుకుని వానరుల నగరమైన కిష్కింధకు వెళ్ళాడు. అక్కడ అతను రాజ్యాభిషేకం చేసుకుని, సప్త ద్వీపాలలోనూ ఉండే వానరుల కందరికీ రాజయాడు.

"రామా, వాలి సుగ్రీవులకు తండ్రీ, తల్లీ కూడా ఋక్షరజసుడే," అని చెప్పి అగస్త్యుడు ఆ కథ ముగించాడు.

రామ పట్టాభిషేకం జరిగాక చాలా రోజులపాటు వచ్చిన వారందరికీ సుఖంగా గడిచింది. అనంతరం ఒకరొకరే వెళ్ళిపోసాగారు. రాముడు అందరికీ తన కృతజ్ఞత తెలుపుకుని, తగిన విధంగా సత్కరించి సాగనంపాడు.

భరతుడు వెంట రాగా జనకమహారాజూ, లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకుని కేకయ మహారాజూ వెళ్ళిపోయారు. భరతుడి ఆహ్వానం పైన వచ్చిన కాశీరాజు

ప్రతర్దనుడూ ఇతర రాజులూ కూడా తమ తమ దేశాలకు తిరిగి వెళ్ళారు.

రాముడి వెంట వచ్చిన వానరులూ, రాక్షసులూ రెండు నెలలపాటు అయోధ్యలో సుఖంగా గడిపి, వారు కూడా బయలు దేరారు. తనకు యుద్ధంలో తోడ్పడిన సుగ్రీవాంగద హనుమంతాదులను రాముడు చక్కగా సత్కరించాడు. అలాగే విభీషణుడికీ, అతని రాక్షసులకూ సన్మానాలు చేశాడు. వారందరూ బయలుదేరి సంతోషంగా కిష్కింధకూ, లంకకూ వెళ్ళిపోయారు.

తరవాత రాముడు సీతతో వనవిహారాలు చేస్తూ, మిత్రులతో గోష్ఠి జరుపుతూ కాలక్షేపం చేస్తూ, వచ్చాడు. సీతలో గర్భ చిహ్నాలు కనిపించాయి. రాముడామెతో, "సీతా, గర్భిణివిగా ఉన్నావు గదా, నీకేమైనా కోరికలుంటే చెప్పు, తీరుస్తాను," అని ఒకనాడన్నాడు.

సీత చిరునవ్వుతో ముఖం వంచుకుని, "నాకు గంగాతీరాన ఋషుల ఆశ్రమాలు చూసి, వారి కందమూల ఫలాలు తిని, అక్కడి చెట్ల కింద విహరించాలని ఉన్నది," అన్నది.

రాముడు, "అలాగే చేతువుగాని, నీ కోరిక ప్రకారం రేపే నిన్ను అక్కడికి పంపుతాను," అన్నాడు.



సీతతో ఈ మాట అని అతను తన మిత్రుల మధ్యకు వచ్చి చాలాసేపు హాస్యపు కథలు చెప్పుకుంటూ కూర్చుని, భద్రుడనే వాణ్ణి చూసి, "అయితే భద్రా, నన్ను గురించీ, సీత గురించీ, నా తల్లులను గురించీ, తమ్ములను గురించీ ప్రజలు ఏమనుకుంటూంటారు?" అని అడిగాడు.

భద్రుడు చేతులు జోడించి, "ప్రజలు అనేక రకాలుగా చెప్పుకుంటారు. వాళ్ళు జాస్తిగా మాట్లాడుకునేది రావణసంహారం గురించి," అన్నాడు.

భద్రుడేదో దాస్తున్నాడని రాముడికి అనుమానం వేసింది. "భద్రా, ఉన్న



మాట చెప్పు. మంచిదయినా, చెడ్డదయినా దాచకు,'' అన్నా డతను.

''సముద్రానికి సేతువు కట్టావనీ, రావణుణ్ణి సమూలంగా నాశనంచేశావనీ ప్రజలు నిన్ను గురించి ఎంతో గొప్పగా చెప్పుకుంటారు. నిన్ను చూసి గర్వపడతారు కూడా. కాని, రావణుడు తన ఒడిలో కూర్చోబెట్టుకుని లంకకు తీసుకుపోయి, అంతకాలం తన అధీనంలో ఉంచుకున్న సీతను మళ్ళీ తెచ్చుకున్న నీకు మంచి చెడ్డలు తెలియ వంటున్నారు. రేపు తమ భార్యల కేమైనా జరిగినా తాము చచ్చినట్టు భరించవలిసిందే గదా అంటున్నారు. యథా రాజా తథా ప్రజా అన్నారు గద. ఎక్కడికి పోయినా జనం గుంపులు గుంపులుగా కూడి ఈ మాటలే చెప్పుకుంటున్నారు,'' అన్నాడు భద్రుడు బాధగా.

రాముడు లోపల తీవ్రంగా బాధపడుతూ మిగిలిన మిత్రులతో, ''ఈ మాట నిజమేనా ?'' అన్నాడు.

అందరూ తలలు వంచుకుని, నిజమేనని చెప్పారు.

రాముడు వారందరినీ పంపేసి, సమీపంలో ఉన్న ద్వారపాలకుణ్ణి పిలిచి, ''లక్ష్మణుణ్ణీ, భరత శత్రుఘ్నులనూ పిలుచుకురా,'' అన్నాడు.

త్వరలోనే వారు ముగ్గురూ రాముడి వద్దకు వచ్చారు. కాంతి లేని ముఖంతో, కన్నుల నీరు కారుస్తూ రాముడు తన తమ్ములను ఆలింగనం చేసుకుని, ఆసనాల మీద కూర్చోబెట్టి, వారికి సీత గురించి తాను పొందిన జనాపవాదం గురించి తెలిపాడు.

''సీత నిర్దోషురాలని అగ్ని ఇతర దేవతలూ చెప్పారు. నా అంతరాత్మలో కూడా అలాగే అనిపించింది. లక్ష్మణా, ఇది నీ ఎదటే గదా జరిగింది? అందుచేతనే సీతను అయోధ్యకు తెచ్చాను. కాని, ఈ అపవాదు భరించటం చాలా బాధగా ఉంది. ప్రాణాలనూ, మిమ్మల్ని అయినా

వదులుతాను గాని, అపకీర్తిని సహించ లేను. సీతను విడవటమనగా ఎంత? ఈ అపవాదును మించిన దుఃఖం నా కుండ బోదు. అందుచేత, లక్ష్మణా, రేపు తెల్లవారుజామున సీతను రథం మీద తమసానదీ తీరాన, వాల్మీకి ఆశ్రమ ప్రాంతంలో అరణ్యంలో వదిలిపెట్టిరా. నా మాటకు ఎదురు చెప్పకు, సీతను గురించి ఏమీ అనకు. అంటే నా పైన ఒట్టే! సీత ఋషుల ఆశ్రమాలను చూడా లని కోరింది. ఆ కోరిక తీరుతుంది." అన్నాడు రాముడు.



ఈ మాటలు చెప్పి అతను బాధగా నిట్టూర్పులు విడుస్తూ అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే లక్ష్మణుడు సుమంత్రుడి వద్దకు వెళ్ళాడు. అతని వాలకం దీనంగా ఉన్నది, నోరెండి పోతున్నది. అతను సుమంత్రుడితో, "సీతను మునుల ఆశ్రమాలకు తీసుకు పొమ్మని రాముడి ఆజ్ఞ అయింది. నేనూ, సీతా ఇప్పుడే బయలుదేరుతున్నాం. వెంటనే రథం సిద్ధం చెయ్యి. సీతకోసం రాజభవనం నుంచి మెత్తని ఆసనం తెచ్చి రథంలో అమర్చు." అన్నాడు.

సుమంత్రుడు రథాన్ని ఆయత్తం చేసి తేగానే లక్ష్మణుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, ఆశ్రమాలు చూడాలని ఉన్నట్టు రాజుగారితో అన్నావుట. రాజుగారి ఆజ్ఞ అయింది, గంగా తీరాన గల ఆశ్రమాలకు పోదాం, బయలుదేరు. మా అన్న ఆజ్ఞ ప్రకారం నేను కూడా నీ వెంట వస్తు న్నాను." అన్నాడు.

సీత ఈ మాటలకు పరమానందం చెంది, వెలగల బట్టలూ, రత్నాలూ, ఆభరణాలూ మునిపత్నుల కోసం తీసు కుని, లక్ష్మణుడి వెంట రథం మీద బయలుదేరింది. రథం వేగంగా పోతూంటే సీతకు దుశ్శకునాలు కనిపించాయి. ఆ సంగతి లక్ష్మణుడితో చెప్పి, "అత్తలూ వాళ్ళూ క్షేమంగా ఉన్నారు కద!"



గంగ దాటించి మునుల ఆశ్రమాలకు తీసుకుపో. మునుల భార్యలకు ఈ కానుక లన్నీ ఇస్తాను. అక్కడ ఈ రాత్రి గడిపి, రేపుదయం అయోధ్యకు తిరిగి పోదాం. రాముణ్ణి ఎప్పుడు మళ్ళీ చూస్తానా అని నాకూ తహతహగానే ఉన్నది,'' అని సీత అన్నది.

లక్ష్మణుడు కళ్ళు తుడుచుకుని దగ్గిరలో ఉన్న పడవ వాళ్ళను పిలిచి, పడవ ఏర్పాటు చేసి, దాని మీద సీతతో సహా గంగ దాటాడు. రథంతో సహా సుమంత్రుడు ఇవతలి ఒడ్డునే ఉండి పోయాడు.

అన్నది. లోపల గుండె గుబగుబ లాడు తున్నప్పటికీ, లక్ష్మణుడు పైకి నవ్వుతూ, "వారంతా క్షేమంగానే ఉన్నారు," అన్నాడు.

రాత్రి అయేసరికి రథం గోమతీతీర్థం చేరింది. ఆ రాత్రి అక్కడ గడిపి, తెల్లవారి బయలుదేరి, మధ్యాహ్నాని కల్లా గంగా తీరానికి చేరుకున్నారు. గంగను చూడ గానే లక్ష్మణుడికి దుఃఖం ఆగలేదు. అది చూసి, "ఇదేమిటి లక్ష్మణా? ఎందు కేడుస్తున్నావు? ఎంతోకాలంగా కోరుకున్న నా కోరిక తీరిందని నేను సంతోషిస్తుంటే, నీ దుఃఖంతో నా ఆనందాన్ని పాడు చేస్తున్నా వెందుకు? నన్ను వేగంగా

అవతలి ఒడ్డు చేరాక లక్ష్మణుడు సీతకు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, "సీతా, మా అన్న నా గుండెలో శూలం గుచ్చేశాడు. ఇంత పాపిష్టి పని చేసే కన్న నేను చచ్చిపోయినా బాగుండిపోను," అంటూ దుఃఖ వివశుడై కూలబడి పోయాడు.

సీత అతని స్థితి చూసి చెప్పలేనంతగా కంగారు పడి, "లక్ష్మణా, నీ మాటలు నాకేమీ అర్థం కావటం లేదు. నువ్వేదో ఉద్రేకంలో ఉన్నట్టున్నావు. నీ బాధకు అసలు కారణమేమిటో నాకు కాస్త స్పష్టంగా చెప్పు. లేకపోతే మీ అన్న మీద ఒట్టే!'' అన్నది.

అప్పుడు లక్ష్మణుడు సీతతో, "అమ్మా, మా అన్న స్నేహితులతో కబుర్లు చెబుతూ నిన్ను గురించి భయంకరమైన లోకాపవాదు విన్నాడు. ఆ అపవాదు నీ చెవుల పడరానిది. దానితో మా అన్న కుమిలిపోయి నిన్ను వదిలిపెట్టేశాడు. నీవల్ల ఏ దోషమూ లేదని మా అన్నకూ తెలుసు, నాకూ తెలుసు. అయినా అపవాదుకు వెరచి ఇలా చేశాడు. నిన్నిక్కడే, విడిచిపెట్టి నేను అయోధ్యకు తిరిగి వెళ్ళాలి. ఇది రాజాజ్ఞ. నువు మనస్సును అధికంగా కష్టపెట్టుకోక, పుణ్యప్రదమైన ఈ ముని ఆశ్రమాలలో ఉండు. వాల్మీకి మహాముని మా తండ్రికి ఆప్త స్నేహితుడు. ఆయనను ఆశ్రయించి సుఖంగా ఉండు," అన్నాడు.

ఈ మాటలు విని సీత ఒక్క క్షణం పాటు దిమ్మరపోయినట్టయింది. తరవాత ఆమె తెప్పరిల్లి, దీనంగా ఏడుస్తూ, "లక్ష్మణా, నేను కష్టాలు పడటానికే పుట్టాను. పూర్వజన్మలో ఏదో పాపం చేసి ఉంటాను; ఏ దంపతులకో ఎడబాటు కలిగించి ఉంటాను. అరణ్యవాసమప్పుడు, రాముడు దగ్గిర ఉండి నన్ను ఓదార్చుతున్నా, నేను దుఃఖిస్తూనే ఉండే దాన్ని; అలాటిది రాముడు వెంట లేని ఈ అరణ్యవాసం ఎలా ఉంటుందో ఆలోచించు. నా దుఃఖం ఎవరితో చెప్పుకునేది? నిన్ను నీ భర్త ఎందుకు వదిలేశాడని మునులు అడిగితే ఏం చెప్పను? ఈ గంగానదిలో పడి చావవచ్చు, కాని అందువల్ల మీ వంశం అపహాస్యంపాలు కావచ్చు. మీ అన్నగారి ఆజ్ఞ, నిర్వర్తించావు. ఇక నువు వెళ్ళు, నాయనా. అత్తలందరికీ నా నమస్కారాలు చెప్పు. రాజుగారి క్షేమమడిగాననీ, ఆయనకు సాష్టాంగ నమస్కారాలు చేశాననీ చెప్పు. ఆయనకు వచ్చిన అపవాదును పోగొట్టటం నా విధి. ధర్మంగా రాజ్యపాలన చేస్తూ, తమ్ముళ్ళనూ, ప్రజలనూ ఒకే విధంగా చూస్తూ, లోకంలో సాటిలేని కీర్తి సంపాదించమని కోరానని ఆయనతో చెప్పు," అన్నది.






ఒకనాటి సాయంకాలం వేళ, ధవళగిరి రాజు వీరవర్మ ఉద్యానంలో విహరిస్తూం డగా, భటుడొకడు ఆయన దగ్గిరకు వచ్చి, "మహారాజా, మీ దర్శనం కోసం, బెస్తవా డొకడు వచ్చాడు," అని చెప్పాడు.

"బెస్తవాడా! వాణ్ణి రేపు సభకు రమ్మను," అన్నాడు వీరవర్మ.

భటుడు వెళ్ళిపోయి, కొంచెం సేపటికి తిరిగి వచ్చి, "తమతో ఒక అతి ముఖ్య విషయం చెప్పి వెళ్ళిపోతాడట. ఇందు కోసం, ఒక మారుమూల పల్లెనుంచి, రెండు రోజులపాటు అష్టకష్టాలుపడి నడిచి వచ్చాడట," అన్నాడు.

"సరే, వాణ్ణి తీసుకురా," అన్నాడు వీరవర్మ విసుక్కుంటూ.

కొద్దిసేపు తరవాత, ఒక పాతికేళ్ళ బెస్త యువకుడు, వీరవర్మ దగ్గిరకు వచ్చి, వినయంగా వంగి నమస్కరించి, "నా పేరు సింహాచలం, మహారాజా!" అన్నాడు.

వీరవర్మ వాడికేసి పరీక్షగా చూస్తూ, "ఒరే, నీ పేరు సింహాచలం కాక, గరుడాచలమైనా వచ్చే ముప్పేమీ వుండదు. నీ పేరు చెప్పేందుకా, నా దర్శనం కోరావు?" అన్నాడు.

"మన్నించండి, మహారాజా! అతి రహస్య విషయం! మా ఊరిపక్క సముద్రంలో, మత్స్యకన్య వున్నది." అన్నాడు సింహాచలం.

"మత్స్యకన్యా!" అంటూ వీరవర్మ ఆశ్చర్యపోయాడు.

"అవును, మహారాజా! ఆ మత్స్యకన్య, లోకంలో ఏం జరుగుతున్నదో చెప్పగలదట," అని జవాబిచ్చాడు సింహాచలం.

"ఏమిటేమిటీ! మత్స్యకన్య, నీతో మాట్లాడడం కూడా జరిగిందా? సరే,

మాచిరాజు కామేశ్వరరావు



ఆ మత్స్యకన్య ఎలా వుంటుంది? ఏం మాట్లాడింది?" అని అడిగాడు వీరవర్మ ఎంతో కుతూహలంగా.

సింహాచలం యిలా చెప్పాడు:

రెండు రోజుల క్రితం, అతడు భోజనం చేసి మధ్యాహ్నంవేళ, పడవలో సముద్రం మీదికి బయలుదేరాడట. ఆ సమయంలో తీరంలో వున్న సరుగుడుచెట్లవైపు నుంచి, కిలకిలమన్న నవ్వు వినిపించింది. సింహాచలం అటు వెళ్ళి చూడగా, నడుంవరకు స్త్రీ ఆకారం, దిగువున చేప ఆకారంతో వున్న మత్స్యకన్య కనిపించింది.

ఆమె, సింహాచలాన్ని చూసి, "ప్రపంచమంతా, యీ వైపున వుంటే, నువ్వు సముద్రంలోకి పోయి తెలుసుకునేదేముంది?" అని అడిగింది.

సింహాచలం, మత్స్యకన్య వింతరూపం చూసి ఆశ్చర్యపోతూ, "ఈ వైపు వున్న ప్రపంచంలో బతకడానికి, నాకు ఆ వైపున వున్న సముద్రమే దిక్కు. అయినా, సముద్రంలో బతికే నీకు, నేలపై బ్రతికే మనుషులపాట్లేం తెలుసు!" అన్నాడు.

దానికి మత్స్యకన్య కిలకిలమంటూ నవ్వి, "నేను సముద్రంలో వున్నా, ప్రపంచంలో, ఏ మూల ఏం జరుగుతున్నదో కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది!" అన్నది.

"అలాగే! అయితే, ఈ క్షణంలో, మా రాజు వీరవర్మగారు ఏం చేస్తున్నారో చెప్పు," అని అడిగాడు సింహాచలం.

మత్స్యకన్య, ఒక క్షణకాలం కళ్ళు మూసుకుని తెరిచి, "ఇప్పుడు, మీ రాజుగారు రాణీని, పాయసం మారువడ్డించమంటున్నాడు." అన్నది.

"వస్తా, యిప్పుడు నువ్వు చెప్పిందానికి రుజువేమిటి?" అని సింహాచలం, చేపలు పట్టేందుకు సముద్రంలోకి వెళ్ళిపోయాడు.

అతడు రాత్రి పొద్దుపోయి తిరిగి వచ్చేసరికి, మత్స్యకన్య అక్కడే వున్నది.

ఆమె, సింహాచలంతో, "ఇప్పుడు, మీ రాజుగారు, రాణీ వడ్డించబోయిన లేడి మాంసం వద్దంటున్నాడు. చూడబోతే,

మీ రాజుగారికి తిండి గొడవ తప్ప మరేం పట్టినట్టులేదు,'' అంటూ సముద్రంలోకి వెళ్ళిపోయింది.



సింహాచలానికి, ఆ రాత్రి మత్స్యకన్యను గురించిన ఆలోచనలతో నిద్రపట్టలేదు. ఆమె చెప్పే సమాచారం, తనకు ఉపయోగించకపోయినా, రాజుగారికి ఉపయోగించగలదన్న నమ్మకం, అతడికి కలిగింది. శత్రురాజుల వ్యూహాలు, దేశద్రోహుల కుట్రలు—యిలా ఎన్నో ముందుగానే తెలుసుకుంటే, రాజ్యానికి ఎంతో క్షేమంగా వుంటుంది!

సింహాచలం, యిలా ఆలోచించి, సరి అయిన కాలిబాట కూడా లేని తన పల్లె నుంచి ఎంతో శ్రమపడి రాజధానికి వచ్చాడు.

సింహాచలం చెప్పింది విన్న వీరవర్మకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. ఆయన భోజనం చేసేటప్పుడు, ఆ గదిలో రాణీ తప్ప మరెవరూ వుండరు. తను రాణీని పాయసం మారువడ్డించమనడం, లేడి మాంసం వద్దనడం—నిజం! ఆ మత్స్య కన్య గొప్ప దివ్యశక్తులు గలదై వుండాలి!

వీరవర్మ యిలా ఆలోచిస్తున్నంతలో, సింహాచలం, ఆయనకు మరొకసారి నమస్కరించి, ''నాకు సెలవిప్పించండి. మహారాజా!'' అన్నాడు.

''సరే, వెళ్ళు! నేను రేపు బయలుదేరి, మీ ఊరు వస్తున్నాను,'' అని చెప్పి, వీరవర్మ, తన సేవకుణ్ణి పిలిచి, అతడికి నూరువరహాలు యిప్పించి, పంపేశాడు.

మర్నాడు వీరవర్మ ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి. కొందరు సైనికులు, సింహాచలం వుండే ఊరుకు వెళ్ళి, రాజూ, రాణీల కోసం, సరుగుడు తోటలో గుడారాలు నిర్మించారు. మరి కొందరు రాజధాని నుంచి, ఆ కుగ్రామానికి రథం, సాంబారాలతో వుండే బళ్ళూ పోయేందుకు, చక్కని బాట ఏర్పాటు చేశారు.

వీరవర్మ, రాణీతో సాయంకాలం వేళకు, ఆ ఊరు చేరాడు. సింహాచలం,



ఆయనకు మత్స్యకన్యను తాను చూసిన ప్రదేశం దగ్గిరకు తీసుకుపోయి, ''మహారాజా, యిక్కడే నేనామెతో మాట్లాడింది,'' అని చెప్పాడు.

అయితే, ఆ పగలుగాని, రాత్రి వెన్నెలలోగాని, మత్స్యకన్య వీరవర్మకు కనిపించలేదు. అయినా, పిండారబోసినట్టున్న వెన్నెలలో, చల్లని సముద్రపు వాతావరణంలో, వాళ్లకు కాలం హాయిగా గడిచిపోయింది.

ఇలా నాలుగు రోజులు గడిచినా, వీరవర్మకు మత్స్యకన్య కనిపించలేదు. ఆయన నిరుత్సాహపడి, యిక రాజధానికి బయలుదేరనున్నంతలో, సింహాచలం ఆయనను ఒంటరిగా కలుసుకుని, ''నన్ను క్షమిస్తానంటే, ఒక నిజం చెబుతాను, మహారాజా!'' అన్నాడు.

''నిజమా! ఏమిటది?'' అని అడిగాడు వీరవర్మ.

''మత్స్యకన్య అంటూ లేదు. అంతా, నా కల్పన,'' అన్నాడు సింహాచలం,

వీరవర్మ ఆశ్చర్యపోయి, ''ఇంత పెద్ద కట్టుకథ, ఎందుకు కల్పించావు?'' అని ప్రశ్నించాడు.

దానికి సింహాచలం, యిలా చెప్పాడు:

అంతఃపురంలో, రాణీగారి దగ్గిర పని చేసే లవంగి అనే దాసీపిల్లది, సింహాచలం వూరే. ఆమె, అతడికి దగ్గిర బంధువు కూడా. వాళ్ళ తల్లిదండ్రులు, వాళ్ళ వివాహానికి, ఏనాడో సమ్మతించారు. అయితే, లవంగి తండ్రి, ఉన్న ఊళ్ళో జరుగుబాటు లేక, రాజధాని చేరి, ఏదో చిన్న వ్యాపారం చేస్తున్నాడు. లవంగి అంతఃపురంలో పనికి కుదిరింది.

వాళ్ళిద్దరి వివాహం, మరొక రెండు వారాల్లో జరగబోతున్నది. ఏమాత్రం ప్రయాణ సౌకర్యం లేని అత్తవారి ఊరు నుంచి, రాజధానిలో వున్న తల్లిదండ్రులను చూసేందుకు రావాలంటే, ఎంతో శ్రమ పడవలసి వస్తుందని, లవంగికి బెంగ పట్టుకున్నది.

"రాజుగారు, ఒకసారి మన ఊరుకు వస్తే, ఆ తర్వాత మన ఊరు నుంచి రాజధానికి చక్కని మార్గం ఏర్పడి పోతుంది," అన్నాడు సింహాచలం.

"ఆ మాట నిజమే! కాని, రాజుగారు; ఆమారుమూల పల్లెకు ఎందుకు వస్తారు?" అని అడిగింది లవంగి.

సింహాచలం, ఆ రోజంతా ఆలోచించి, ఈ మత్స్యకన్య పథకం తయారు చేశాడు.

వీరవర్మ, సింహాచలం చెప్పినదంతా విని నవ్వి, "నేను, మహారాణిని పాయసం మారు వడ్డించమనడం, లేడి మాంసం వద్దనడం—ఈ సంగతి, నీకెలా తెలిసింది?" అని అడిగాడు.

"ఏదో మాటల సందర్భంలో, మహారాణిగారు, యీ సంగతి లవంగితో అన్నది. లవంగి నుంచి, ఈ వివరం తెలుసుకున్నాకే, నేను మత్స్యకన్య పథకం గురించి ఆలోచించాను, మహారాజా! మీ రాకతో, మా ఊరు స్వరూపమే మారి పోయింది. రాజధాని నుంచి, మా ఊరుకు చక్కని బాట ఏర్పడింది. లవంగి కావాలనుకున్నప్పుడు, బాడుగబండిలో పోయి, రాజధానిలో వున్న తల్లిదండ్రులను చూసి రాగలదు," అన్నాడు సింహాచలం.

వీరవర్మ ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, "ఒరే, నీ కాబోయే భార్యతో చేరి, చాలా పెద్ద నాటకమే ఆడావు. అయితే, ఇందువల్ల, నా కొక సత్యం తెలిసివచ్చింది. రాజు దేశం అన్ని మూలలా పర్యటిస్తే తప్ప, ప్రజల యిబ్బందులు తెలుసుకోలేడు. ఇకనుంచి, సంవత్సరంలో, కనీసం నెల రోజుల పాటు, దేశపర్యటన చేస్తాను," అని, మెడలో నుంచి హారం తీసి, సింహాచలానికిస్తూ, "ఇది నీకూ, లవంగికీ, మా పెళ్ళి బహుమతి!" అన్నాడు.

మత్స్యకన్య పేరుతో, తను ఆడిన కపటనాటకం, రాజుకు కోపం తెప్పిస్తుందేమో అన్న శంకలో వున్న సింహాచలం, ఆయన యిచ్చిన బహుమతి తీసుకుని పరమానందం చెందాడు.





# అపకారికి ఉపకారం

## 3

పెద్దమనుషులుగా నటిస్తూ, దుర్మార్గ కార్యాలు చేసేవాళ్ళలో, రెండు రకాలుంటారు. మొదటిరకం వాళ్ళు తెలివైన వాళ్ళు. వాళ్ళు ప్రజలకు మాయమాటలు చెబుతారు. ప్రజలకు ఏ మేలు జరిగినా, తమవల్లనే అంటూ, ఆ ప్రజల కష్టం మీదే బతుకుతారు.

రెండోరకం దుర్మార్గులు తెలివి తక్కువవాళ్లు. వాళ్లు ప్రజలను బాధించి ఆనందిస్తారు. తెలివైన దుర్మార్గులకు, ప్రజలవల్ల ఎన్నటికీ ప్రమాదం వుండదు. ప్రజల్లో కూడా తెలివితేటలు వస్తేనే, వాళ్ళకు ప్రమాదం. ఇకపోతే, తెలివి తక్కువ దుర్మార్గులకు ప్రజలవల్ల ప్రమాదం తప్పదు. ప్రజలు ఎంతో కాలం వాళ్ళను భరించలేరు, ఏదో ఒకనాడు తిరగబడతారు.

ఇలాంటి పరిస్థితే, శతనందన గ్రామంలో తల ఎత్తింది. గ్రామ పెద్ద లిద్దరూ తెలివైన దుర్మార్గులే కాని, వాళ్ళకు తెలివి తక్కువ దుర్మార్గులైన కొడుకులు పుట్టారు! వాళ్ళు గ్రామంలో, మూర్ఖులైన ప్రజలు తమ తండ్రుల కిచ్చే గౌరవ మర్యాదలను ఆసరాగా చేసుకుని, చిన్నప్పటి నుంచీ విపరీతంగా అల్లరి చిల్లరపనులు చేయసాగారు.

వాళ్ళిద్దరూ ఒక్కటే ప్రాణం అన్నట్టుగా వుండేవాళ్ళు. ఎవళ్ళ తోటలోకో వెళ్ళి, మామిడికాయలు దొంగిలించడం, ఎవరింటికో వెళ్ళి, గాజుసామానులు బద్దలు కొట్టడం, ఇతరుల పిల్లలను అకారణంగా హింసించడం—ఇలాంటి దుర్మార్గ కార్యాలు చేస్తూండేవాళ్ళు.

ఈ విషయం విన్న పెద్దలిద్దరూ, కొడుకులతో, "మీరు, ఇతర్ల తోటలలోకి వెళ్ళి కాయలూ, పళ్ళూ కోయడమే కాదు, ఇళ్ళకు వెళ్ళి పాలూ, వెన్నా కూడా దొంగిలిస్తూండండి. అప్పుడు, మా పని మరింత సులభమవుతుంది!" అన్నారు.

కొడుకులకు, ఈ సలహా నచ్చింది. వాళ్ళు అలాగే చేయసాగారు. కొన్నాళ్ళలా జరిగేసరికి, గ్రామ ప్రజలు యిక భరించలేక, పెద్దల ఇళ్ళకు పోయి, తమ కష్టాల గురించి చెప్పుకున్నారు.



పెద్దలు ముందు వాళ్ళను శాంతపరిచి, తర్వాత నెమ్మదిగా, "మా పిల్లలలో శ్రీకృష్ణుడి అంశవున్నది. అందువల్లనే, వాళ్ళలా అల్లరి చేస్తున్నారు. ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు అల్లరి చేస్తూంటే, గోపికలు వెళ్లి యశోదతో చెప్పుకుంటూండే వాళ్ళు. కాని, వాస్తవమేమంటే, అందరికీ శ్రీకృష్ణుడంటే యిష్టమే! మీకు భాగవత గాథ తెలియక బాధపడుతున్నారు. ఈ రోజు నుంచీ, మీరందరూ సాయంత్రాలు, మా ఇళ్లకు వచ్చి భాగవత పురాణగాథలు, వినండి," అని చెప్పారు.

ఆ రోజు నుంచీ గ్రామస్థులకు, గ్రామ పెద్దల పిల్లల బెడద తప్పకపోయినా, రోజూ సాయంత్రాలు, గ్రామ పెద్దలు చెప్పే పురాణకథలు వినవలసి వచ్చింది. అయితే, ఈ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. భాగవతం వింటూంటే, ప్రజలకు రకరకాల అనుమానాలు కలగసాగాయి.

శ్రీకృష్ణుడు చిన్నతనంలో, అల్లరి పనులు చాలా చేశాడు. దొంగతనాలు చేశాడు. అయితే, ఎన్నో మాయలూ చేశాడు. తన వాళ్లు కష్టాల్లో వున్నప్పుడల్లా, వాళ్లను కాపాడుతూ వచ్చాడు. కాళీయుణ్ణి చంపాడు; గోవర్ధనపర్వతం ఎత్తాడు. గ్రామ పెద్దల పిల్లలు మాత్రం చెడ్డపనులే చేస్తున్నారు. సంతోషాన్ని కలిగించడం లేదు!

చాలామంది గ్రామస్థులు, తమ సందేహాలను పెద్దలకే చెప్పుకున్నారు. అప్పుడు పెద్దలిద్దరూ ఆలోచనలో పడ్డారు.



''మీరడిగినది, న్యాయంగానే వున్నది. ఒక రాత్రంతా తపస్సుచేసి, ఇందులోని రహస్యం తెలుసుకుని, మీకు చెబుతాం,'' అని పెద్దపెద్ద, వాళ్ళకు చెప్పి పంపేశాడు.

వాళ్ళు వెళ్ళి పోయాక చిన్నపెద్ద, పెద్దపెద్దతో, ''మనమిప్పుడేం చేయాలి? మన పిల్లల కారణంగా, మన అధికారం దెబ్బతినేలా వున్నది. వాళ్ళకేదో విధంగా, మంచిగా వుండమని గట్టిగా బుద్ధి చెబితే గాని, గ్రామస్థులూరుకోరు,'' అన్నాడు.

పెద్దపెద్ద కాసేపాలోచించి, ''మన పిల్లలు, మన మాట వినరు. వాళ్ళు వింటామన్నా, వాళ్ళ మనసు కష్టపెట్టడం, మన కిష్టముండదు. అసలీ ప్రమాద మంతా, గ్రామస్థులకు పురాణం వినిపించడంవల్ల వచ్చింది. పురాణకథలు చెప్పడం ద్వారా, ప్రజలను మరింత మూర్ఖుల్ని చేసి, చెడ్డతనాన్ని సహించే అలవాటు చేయవచ్చనుకున్నాను. కాని, పురాణాలు వింటే, ప్రజల్లో తెలివితేటలు పెరుగుతున్నవి. వాళ్ళకు, చెడ్డను ఎదిరించే ధైర్యం వస్తున్నది. అందువల్ల, మనం ముందు గ్రామస్థులకు పురాణాలు వినిపించడం మానివేయాలి,'' అన్నాడు.

''అది సరే, ముందు మన పిల్లల్ని అదుపుచేయడం ఎలా?'' అని అడిగాడు చిన్నపెద్ద.

ఇద్దరూ, ఆ రాత్రంతా ఆలోచించారు. చివరకు, వాళ్ళకు ఒక మంచి ఉపాయమే తట్టింది. మర్నాడు గ్రామస్థులు పురాణం వినడానికి వచ్చినప్పుడు, పెద్దపెద్ద, వాళ్ళకు జయవిజయులకథ చెప్పాడు:

జయుడు, విజయుడు వైకుంఠంలో, శ్రీ మహావిష్ణువుకు ద్వారపాలకులు. ఒకసారి, సనకుడు, సనందనుడు మొదలైన మునులు, విష్ణుమూర్తి దర్శనానికి వెళితే, వాళ్ళిద్దరూ ద్వారం దగ్గిర వుండి, ''ఇది సమయం కాదు; కాసేపాగండి!'' అని వాళ్ళను ఆపారు.

తమను అలా ఆపినందుకు మునులు కోపించి, జయవిజయులను రాక్షసులు

కండని శపించారు. ఇది తెలిసి విష్ణుమూర్తి, జయవిజయులను పిలిచి, "ఇందులో, మీ తప్పేమీ లేదు. మునిశాపం అమోఘంకాబట్టి, మీరు రాక్షసజన్మ ఎత్తక తప్పదు. అయితే, మీకొక అవకాశం యిస్తున్నాను! మంచి పనులు చేసి పుణ్యాత్ములనిపించుకుంటూ, ఏడు జన్మలెత్తి, ఆ తర్వాత నన్ను చేరుకుంటారా? లేక దుర్మార్గులుగా మూడు జన్మలెత్తి, నన్ను చేరుకుంటారా?'' అని అడిగాడు.

అందుకు జయవిజయులు, ''నిన్ను విడిచి ఎక్కువకాలం వుండలేము. పరమ దుర్మార్గులం, ప్రజాకంటకులం అనిపించుకున్నాసరే, మూడు జన్మలెత్తి నిన్ను చేరుకుంటాము,'' అని చెప్పారు.

ఆ విధంగా, వాళ్ళు కృతయుగంలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగానూ, త్రేతా యుగంలో రావణ, కుంభకర్ణులుగానూ, ద్వాపరయుగంలో శిశుపాల, దంతవక్త్రులుగానూ పుట్టి, దుర్మార్గాలు చేసి, చివరకు విష్ణుమూర్తిని చేరుకున్నారు.

పెద్దపెద్ద, యీ విధంగా గ్రామస్థులకు జయవిజయులకథ చెప్పి, ''ఇంతవరకూ చెప్పింది, మీ అందరికీ తెలిసిన కథే! ఆ తర్వాత కలియుగం వచ్చింది. కలి పురుషుడికి—అన్ని యుగాలనూ మించి, తన యుగం ఎక్కువ పేరు తెచ్చుకోవాలన్న కోర్కె కలిగింది. అతడు విష్ణుమూర్తివద్దకు వెళ్ళి, ''అన్ని యుగాల్లోనూ జయవిజయులు పుట్టి, దుర్మార్గాలు





చేశారు. నా యుగంలో కూడా, వాళ్ళు పుట్టి, దుర్మార్గాలు చేసేలా అనుగ్రహించు. లేకపోతే నీది పక్షపాతబుద్ధి అవుతుంది,'' అన్నాడు.

విష్ణువు, కలిపురుషుణ్ణి అనుగ్రహించాడు. ఆ విధంగా జయవిజయు లిద్దరూ, మా ఇళ్ళల్లో పుట్టారు. మా బిడ్డ లిద్దరూ, సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు ద్వారపాలకులు. త్వరత్వరగా పాపాలు చేసి, శ్రీమహావిష్ణువును చేరాలనుకుంటున్నారు. అందుకు, విష్ణువే అంగీకరించినప్పుడు, మనం ఏం చేయగలం? సహించకతప్పదు! మనం వీళ్ళను ఎదిరిస్తే, విష్ణువుకు ఆగ్రహం వస్తుంది. విష్ణువుకు ఆగ్రహం తెప్పించడానికి, మీకు అభ్యంతరం లేకపోతే, వాళ్ళు మా బిడ్డలని కూడా కనికరించకుండా, కఠినంగా శిక్షించగలం! ఏం చేయాలో, మీరే చెప్పండి,'' అని అడిగాడు.

"జయవిజయులంతటివాళ్లను, మనం ఏం చేయగలం? వాళ్ళను అంతం చేయడానికి, ఆ శ్రీమహావిష్ణువే వస్తాడు. అంతవరకూ ఎదురు చూడక తప్పదు,'' అన్నారు గ్రామస్థు లందరూ ఏకకంఠంతో.

ఆనాటి నుంచీ శతనందన గ్రామంలో, గ్రామపెద్దల కొడుకు లిద్దరికీ ఎదురు లేకుండా పోయింది. గ్రామస్థులు, వాళ్ళేం చేసినా పట్టించుకోవడం మానేసి, భరించడం నేర్చుకున్నారు. క్రమంగా పెద్ద పెద్ద కొడుక్కు జయుడనీ, చిన్న పెద్ద కొడుక్కు విజయుడనీ పేర్లు స్థిరపడ్డాయి.

జయుడు, విజయుడు యిప్పుడు ఇరవై ఏళ్ళ వయసు వాళ్ళయ్యారు. గ్రామంలో వాళ్ళు చెయ్యని ఆగడమంటూ లేదు.

ఇలా వుండగా, ఆ గ్రామానికి ఒక రోజున పరదేశీ ఒకడు వచ్చాడు. అతడికి ఇరవై సంవత్సరాల వయసుంటుంది. పచ్చని దబ్బపండు వంటి శరీరచ్ఛాయ, ఆరడుగులపొడవు, అందమైన రూపం, ముఖంలో అపురూపమైన తేజస్సు చూసి—చాలామంది అతడు గొప్ప రాజవంశస్థుడై వుంటాడనుకున్నారు.

పరదేశి ముందుగా కొంతసేపు, ఒక చెట్టు కింద కూర్చున్నాడు. చాలా దూరం నుంచి నడిచి వచ్చాడేమో, మనిషి బాగా అలిసిపోయి వున్నాడు. కాసేపు సేద తీరాక, ఆ దారినేపోతున్న ఒక దానయ్యను పలకరించి, "బాబూ, ఈ ఒక్క రోజూ, నీ ఇంట వుంటాను, సమ్మతమేనా?" అని అడిగాడు.

దానయ్య కంగారుగా, "ఏమో, మా గ్రామపెద్ద నడిగి చెబుతాను," అని వెళ్లి పోయాడు.

పరదేశి ఆశ్చర్యపడుతూ, చెట్టు కింది నుంచిలేచి బయలుదేరాడు. అప్పుడతడికి, నది నుంచి నీరు తెచ్చుకుంటున్న ఒక స్త్రీ కనిపించింది. పరదేశి, ఆమెను, "అమ్మా, దాహంగా వున్నది. కాసిని మంచినీళ్ళిస్తారా?" అని అడిగాడు.

ఆ స్త్రీ, "ఏమో, మా గ్రామపెద్ద నడిగి చెబుతాను," అని వెళ్ళిపోయింది.

ఆ తర్వాత పరదేశి, దారిలో ఎదురైన చాలామందిని పలకరించాడు. అతడేమడిగినా, అందరూ గ్రామ పెద్ద గురించే చెప్పసాగారు. తమాషాగా వున్నదే—అనుకుంటూ పరదేశి గ్రామ వీధులన్నీ తిరుగుతూండగా, అతడికి ఒక ఇంట్లో నుంచి ఏడుపులు వినిపించినై. కారణం ఏమిటో తెలుసుకోవాలనుకుని, అతడు ఆ ఇంట్లో అడుగుపెట్టాడు.

అక్కడ నేల మీద ఒక చాపవేసి వున్నది. దాని మీద పదేళ్ళ కుర్రవాడొకడు



పడుకుని వున్నాడు. వాడిచుట్టూచేరి, పది మంది పెద్దవాళ్ళు శోకాలు పెడుతున్నారు.

పరదేశి, వాళ్ళను, ''ఏం జరిగింది ? అందరూ, ఎందుకలా దుఃఖిస్తున్నారు ?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న విని, వాళ్ళు తలలు ఎత్తి పరదేశిని చూశారు. వాళ్ళల్లో ఒకడు కంగారుగా, ''నువ్వు పరదేశివి గదా! మా గ్రామపెద్దకు చెప్పందే, నీకెలాంటి జవాబూ యివ్వం,'' అన్నాడు.

పరదేశి, అతడి మాటలు పట్టించుకోకుండా ముందుకు వెళ్ళి, చాపమీద వున్న కుర్రవాడి పక్కనే కూర్చుని, నాడి పరీక్షించి చూసి, ''మీరెందు కేడుస్తున్నారో, తెలియడం లేదు! ఈ బాలుడి ఆరోగ్యానికెలాంటి ప్రమాదమూ లేదు. నేను వైద్యం చేసి బతికించగలను,'' అన్నాడు.

అప్పుడు, వాళ్ళల్లో ఒక స్త్రీ, ''మేము చేసిన పాపాలకు ఫలితంగా, వీడు చచ్చిపోక తప్పదు. మా గ్రామ పెద్ద వైద్యం చేసినా, వీడికి నయం కాలేదు. ఇంకెవరైనా వైద్యం చేసినా, వీడి ప్రాణాలు దక్కవుగాని — చచ్చి నరకానికి పోతాడు!" అన్నది.

పరదేశి తను వైద్యం చేసేందుకు, వాళ్ళ అనుమతి కోసం అడిగాడు. వాళ్లు ఒప్పుకోలేదు. చివరికతడు బాగా విసిగిపోయి, ''మీరు వద్దన్నాసరే — నా కళ్ళ ముందు ఒక మనిషి ప్రాణాలు పోతూంటే, చూస్తూ వూరుకోను. నేనీ బాలుడికి వైద్యం చేసి తీరుతాను,'' అన్నాడు.

''మేము, నిన్ను వైద్యం చెయ్యనివ్వం"! అన్నారు అందరూ ఏకకంఠంతో.

పరదేశి వెంటనే, ''నన్ను వైద్యం చెయ్యకుండా, ఎలా ఆపగలరు ? అలా ఆపమని గ్రామపెద్ద, మీకు చెప్పలేదు గదా ?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే, బాలుడి చుట్టూ వున్నవాళ్ళు సందిగ్ధంలో పడ్డారు. ఈ పరదేశి చెప్పింది, నిజమే! మనం త్వరగా వెళ్ళి, పెద్దల అనుమతి తీసుకురావాలి అనుకుని, వాళ్ళల్లో యిద్దరు పెద్దల ఇళ్ళకు పరిగెత్తారు. —(ఇంకా ఉంది)



# ప్రకృతి వింతలు:

## పిరన్‌హా

దక్షిణ అమెరికాలోని నదులలో 16 రకాల పిరన్హా జలచరాలు ఉన్నాయి. అయితే వీటిలో నాలుగు రకాలు మాత్రమే మనుషులకు అపాయకరమైనవి. ఇవి వేలకొలది, గుంపులు గుంపులుగా ఈదుకుంటూ వెళుతూ ఉంటాయి.



## అత్యధిక వర్షపాతం!



హవాయ్‌లోని వాయ్—అలేఅలే పర్వత ప్రాంతంలో యేడాదికి 335 రోజులూ వర్షం కురుస్తూనే ఉంటుంది. యేటా ఇక్కడ సగటున 486.1 అంగుళాల వర్షం కురుస్తుంది.

## రక్తంచిమ్మే కళ్లు!

అమెరికాలోని కొమ్ములగోదురుకప్ప కావాలంటే కళ్ళనుంచి రక్తం చిమ్మగలదు. తలలో రక్త ప్రసరణను ఎక్కువచేసి, కళ్ళలోని చిన్న రక్తనాళాల పొరలను చిట్లేట్టు చేయడం ద్వారా ఇది సాధ్యమవుతున్నది. ఆత్మరక్షణకు ఈ జంతువు ఇలా చేస్తున్నదని భావిస్తున్నారు!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 మే నెల సంచికలో ప్రకటింపబడును.




M. Natarajan



S. B. Prasad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎత్తుకుంటే ముద్దు

రెండవ ఫోటో: పొత్తుకుదరడం కద్దు

పంపినవారు: ఆర్. దామోదరం, గూడూరు–524 101 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


### చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## Statement about ownership of CHANDAMAMA (Telugu)
## Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. *Place of Publication* | ... 'CHANDAMAMA BUILDINGS'<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity of Publication* | ... MONTHLY<br>... 1st of each calendar month |
| 3. *Printer's Name* | ... B.V. REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... Prasad Process Private Limited<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 4. *Publisher's Name* | ... B. VISWANATHA REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... Chandamama Publications<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 5. *Editor's Name* | ... B. NAGI REDDI |
| *Nationality* | ... INDIAN |
| *Address* | ... 'Chandamama Buildings'<br>188 N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 6. *Name and Address of individuals who own the paper* | ... CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. B.VENKATRAMA REDDY<br>2. B.V.SANJAY REDDY<br>3. B.V.NARESH REDDY<br>4. B.PADMAVATHI<br>5. B.VASUNDHARA<br>6. B.V.SHARATH REDDY<br>7. B.N.RAJESH (Minor)<br>8. B.L.ARCHANA (Minor)<br>9. B.L.ARADHANA (Minor)<br>(All Three Minors admitted to the benefits of Partnership) |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March 1987*

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

A Super treat in every sweet!

# SUPER SIZE! SUPER TASTE!

nutrine

Superstar

Premium toffees












TWIN TREAT

DELITE

TOP CREAM



Heavenly delights



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రై. లిమిటెడ్, చిత్తూరు ఆంధ్రప్రదేశ్

CLARION/NC/8636